# అనూరాధ

శరత్ బాబు

అనువాదం:
శివరామకృష్ణ

దేశికవితా మండలి
విజయవాడ - 2

దేశీ ప్రచురణ
ద్వితీయ ముద్రణ
డిశంబరు 1952
కిసాన్ ప్రెస్——
——విజయవాడ.
వెల : ముప్పావలా



సంపాదకులు :
బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ



# అనూరాధ

౧

పెళ్లీడుకొచ్చిన పిల్ల వయసు విషయంలో ఆడవలసిన అబద్ధాలన్నీ ఆడినాకూడా పెళ్ళయ్యే ఆశ లేకపోయింది. పిల్ల వాని తరఫువారు 'ఇదేమి సోద్యమమ్మా'తో ప్రారంభించి మూతివిరుపులతోనైనా పిల్ల సంగతులు అడగటానికి యిష్టపడ లేదు, సంఘంలో ఒకవిధంగా ఆ సంగతులే అనవసరమని పిస్తూవున్నాయి.

పాపం అనూరాధ స్థితికూడా అలాంటిదే! విచిత్రమేమిటంటే ఇదేమీ పూర్వకాలపు ఘటనకాదు. ఈ కాలపు సంగతే. అలాంటి ఈ కాలంలోకూడా కట్నంకానుకలు కుల గోత్రాలు, తిథినక్షత్రాలు ఎంచడంలోనే అనూరాధ వయసు ఇరవైమూడేళ్ళు దాటిపోయింది. అప్పటికీ వరుడుదొరకలేదు. ఇది చెప్పేన నమ్మతగ్గవిషయంకాదు. అయినా జరిగిందిమాత్రం యథార్థం. ఇవ్వాళఉదయంసకూడా జమీందారుగారి కచేరీలో ఈవిషయాన్ని గురించే చర్చ జరిగింది. కొత్త జమీందారు పేరు హరిహరఘోష్‌పాల్. కలకత్తా నివాసి, అతని చిన్న కొడుకు విజయుడు, ఊరుచూడటానికి వచ్చాడు. విజయుడు నోట్లో సిగరెట్టుతీసి కిందపెట్టి "ఏమండీ! గగనచట్టర్జీ చెల్లెలు ఇంట్లోంచి కదలనంటుందా?" అన్నాడు.

కబురుతెచ్చిన మనిషి "నేను చెప్పవలసిందేదో చిన

బాబుగారు వచ్చినప్పుడు వారితోనే చెప్పుకుంటాను అంది" అని చెప్పాడు.

విజయుడు క్రోధంతో "చెప్పే దేముంది? అంటే ఆ యింట్లోంచి వారిని గెంటించటానికి స్వయంగా నేను వెళ్ళా లన్నమాట. ఇతరులవల్ల కాదూ" అన్నాడు.

ఆ మనిషి మాట్లాడలేదు "చెప్పేందుకూ, వినేందుకూ అందులో ఏమీలేదు. వినోదా! నేను వినదలచుకోలేదు. దీని కోసం ఆమెవద్దకు నేను వెళ్ళాలా? ఆమెవచ్చి తన కష్టనిష్ఠురా లేమిటో స్వయంగా నాతో చెప్పుకోకూడదూ?" అన్నాడు మళ్ళీ విజయుడు.

"నేను చెప్పానుకూడా — నేనూ ఘరానా కుటుం బంలో పుట్టిన బిడ్డనే వినోదబాబా? ఇల్లు వదలిపెట్టి వెళ్ళవలసివస్తే వారితో చెప్పి ఒక్కసారే వెళతాను. చీటికి మాటికి బైటికిరాను, అన్నది అనూరాధ" అన్నాడు వినోద్.

"పేరే మన్నావు? అనూరాధా? చాలా నాజూకైన పేరే. అందుకనే అహంకారం యింకా చావనట్టుంది."

"లేదండీ"

వినోద్ ఆవూరి నివాసి. అనూరాధ కీనచరిత్రను చెబు తున్నాడు. కాని అనతి పూర్వచరిత్రలో కూడా అతిపూర్వ గాధలుంటాయి. అదే చెబుతున్నాను.

ఆ వూరిపేరు గణేశపుం. జమిందా గ్రామం. ఒకప్పుడు అది అనూరాధ పూర్వీకులదే. పరాయివాళ్ళ చేతుల్లోకిపోయి అయిదారేళ్ళయింది. దీని సంవత్సరాదాయం ఏనాడూ రెండు

వేసకవించలేదు. అయినా అనూరాధతండ్రి అమరచటర్జీ పర్యా ఇన్నైనే వేలు వచ్చేవాడి లాగుండేది. ఆఖరుకు అప్పు మూలకంగా కాపురముండే ఇల్లుకూడా డిక్రీఅయింది. కాని జాకీ కాలేదు; సాహుకారు భయంతో ఆగిపోయాడు. చట్టోపాధ్యాయుడు ఎంత వున్నత కులస్తుడో — పూజాపునస్కారాలు, జపతపాలలో కూడా అంత ప్రసిద్ధుడే. చిల్లిపడ్డ అతని సంసారనౌక దుర్వ్యయమనే వుప్పుపేటిలో అంచులవరకు నిండుకొచ్చింది. కాని మునగలేదు. హిందూదురభిమాన మనే గాలికుమూలం రేగి మునుగుతూ తేలుతూవున్న ఆ నావను నెట్టుకుంటూ నెట్టుకుంటూ చివరికి అమరచటర్జీ ఆయుష్షుతో పాటు ఆస్తిని పూర్తిజేసింది. ఇంతకూ అతని జీవితం మంచిగానే వెళ్ళిపోరా పోయిందనే చెప్పాలి. పోయిందికూడా మంచిగానే. శ్రాద్ధకర్మలన్నీ కూడా బాగానే జరిగాయి. కాని అతనితో పాటు ఆస్తిపాస్తులుకూడా హరించుకుపోయాయి. అంచులవరకు నిండుకొచ్చిన ఆ కురానాకుటుంబ మనే నౌక దారిద్ర్యా దలతో అగాధజలరాసిలో బుడికిపోవటానికి సిద్ధంగా వుంది.

తండ్రి మరణానంతరం కొడుకు గగనునికి, ఒక పాత కొంప, తలవరకు అప్పుతో వున్న పల్లెసంపత్తి, ఇంకా మరి కొంత గొడ్డూ-గోదా, వీటన్నిటికంటే మించి పెళ్ళెదు కొచ్చిన మారుటి చెల్లెలు అనూరాధను పోషించే భారం నెత్తిన పడింది.

ఆమె కొకవరుడు కూడా దొరికాడు-అపూర్వొక్ళనే ఒక పెద్దమనిషి. అయిదారుగురు పిల్లల్నీ చుట్టుపక్కాలనూ వదలి

అతనిభార్య మరణించింది. ఇప్పుడతను మళ్లీ వివాహం చేసుకో వాలను కుంటున్నాడు.

"రాజపుత్రుడైనా బాధలేదు. అన్నయ్యా! నువ్వు నన్నతనికే యిచ్చిచెయ్యి! డబ్బుంది. తిండికీ బట్టకీ లోటు వుండదు" అన్నది అనూరాధ.

"ఇదేంమాట? త్రిలోచనునివద్ద డబ్బు వుందని వప్పు కుంటాను. కాని అతని తండ్రి కులభ్రష్టం చేసి సతీశపురం చక్రవర్తులతో సంబంధం చేశాడు తెలుసా? వారి గౌరవ మర్యాదలేమిటో..." అన్నాడు గగనుడు ఆశ్చర్యంతో.

"ఏమున్నా ఏంలేకపోయి నాడబ్బువుందిగా. కులంలో వుండి పస్తులుండే కన్న పొట్టనుపట్టెడన్నం దొరకటం మంచిది కాదన్నయ్యా?" అన్నది చెల్లెలు.

"కాదు, మంచిదికాదు" అని గగనుడు తల తిప్పాడు.

"ఎందుకు మంచిదికాదు? చెప్పు వీటన్నిటిని నాన్న గారే వప్పుకున్నప్పుడు నీ దేముంది?"

ఇక్కడ ఒక్కవిషయం చెప్పటం అవసరం. తండ్రి చాదస్తం కొడుకుకు పోలేదు. మద్య మాంసాదులు, ఇంకా కొన్నిఆనుషంగిక విషయాలలోనూ, పూర్తిగా మోహానికి లోబడినవాడు. పత్నీవియోగపు కొరత పక్కవూరు నీచ కుల స్త్రీ ఒకతె తీర్చివుందని అందరికీ తెలుసు.

గగనుడు మండిపడి "నాలో చాదస్త మేమీ లేదు. కాని శాస్త్రానుసారంగా వస్తున్న కులాచారాన్ని నీ కోసం తిలాంజలి వదలి-నా పదిహేనుతరాలవాళ్లని నరకకూపంలో ముంచి వదలమంటావా? మేము కృష్ణభగవానుని సంతానం

స్వభావం వున్నతమైతేయేం! ఛీ!ఛీ! ఇలాంటి నీచపుమాటలు ఇంకెప్పుడూ నోటివెంట రానియ్యకు” అని గగనుడుకోపంతో వెళ్లి పోయాడు. గంగోపాధ్యాయుని వివాహప్రసంగంఅంతట తోనే ఆగిపోయింది.

గగనుడు హరిహరఘోష్‌సాబ్‌ని ఆశ్రయించాడు. కలకత్తాలో కలపవ్యాపారం చేసి హరిహరుడు లక్షాధికారి అయ్యాడు. ఒకప్పుడు అతని తాతముత్తవలు ఈ ఫ్రాంక్ఫ్ సే వుంటూవుండేవారు. చిన్నప్పుడు చటోపాధ్యాయుల ఐశ్వర్యం కళ్లారా చూచాడు. వారింట్లో మిఠాయితిన్న రోజులుకూడా అనేక మున్నాయి. డబ్బంటే అతనికి లెక్కలేదు. అందుకనే రాజీపడి చటర్జీల ఋణమంతాతీర్చి హరిహరుడు గణేశపురం కొన్నాడు. బైట మూడుగదులుమాత్రం ఆఫీసుకు వుంచు కొని లోపలిభాగమంతా గగనుడు హాదునసే షరతు మీద అప్పువాళ్ళకు డిక్రీమొత్తంయిచ్చి యిల్లు వాపసుతీసుకున్నాడు.

జమీందారీ కొన్నాడు. కాని ప్రజలు కొత్తజమీందారు స్వాధీనంలోకి పోవటానికి తిరస్కరించారు. ఆస్తి తక్కువ. శిస్తుకూడా అంతంతమాత్రమే అందుచేత అట్ట హాసాలేమీ జరగటానికి వీలులేకపోయింది. అయినా కొద్ది లోనే గగనుడు అతికౌశలముతో హరిహరునిపక్షాన గణేశ పురంలో ఒక్క నౌకరునుకూడా లేకుండా చేశాడు. అందు చేత గగనుడు అభీష్టానుసారంగానే గుమాస్తాగా నియుక్తు డయ్యాడు. అంటే—లోగడ జమీందారు ప్రస్తుతపు జమీందారునికి గుమాస్తా అయ్యాడన్నమాట. అతను ప్రజలను వశపర్చుకున్నాక హరిహరుని ప్రాణాలు కుదుటపడ్డాయి. కాని

వసూళ్ళుమాత్రం యథావిధిగానే వున్నాయి. ఒక్కదమ్మిడీ కూడా చిట్టాలో జమలేదు. ఈ గందరగోళాలలో నుంచి రెండేళ్ళు గడచిపోయింది. ఒక రోజున హఠాత్తుగా గుమాస్తా గగనపట్టి మాయ మయ్యాడని కబురువచ్చింది. తర్వాత ఒక రోజున హరిహరుని తాలూకు మనిషి వచ్చి-వసూలయిన పైకాన్నంతా గగనపట్టి మింగి మాయ మయ్యాడని జాడ తీశాడు.

స్టేషనులో రిపోర్టు, ఠాణాలో విచారణా, ఇంకా జరగవలసినవన్నీ జరిగినాయి. కాని డబ్బూ దొరకలేదు, గగనుడూ అంతులేదు. ఆయింట్లో గగనుని చెల్లెలు అనూరాధ, ఆమెకు తోడుగా వయసుకు చెల్లెలైన ఓ దూరపుబంధువుల అమ్మాయి వుంటున్నారు. పోలీసులు సిరిద్దరిసి - నయానా భయానా ఎలా అడిగినా నిజం బైటపడలేదు.

విజయుడు విదేశాలకు వెళ్ళివచ్చాడు. ప్రతి పరీక్షా తప్పటంవల్ల అతనికోసం హరిహరుడు చాలాడబ్బు ఖర్చుపెట్ట వలసివచ్చింది. అయినా ప్యాసు కాలేకపోయాడు. చివరికి విసిగి ఇంటికి మరలివచ్చాడు. విజయుడు చెప్పటం- 'విదేశాలలో ప్యాసవటం, తప్పటంలో ఎక్కువ వ్యత్యాసం లేదు. పుస్తకాలు వల్లించి గాడిదకూడా ప్యాసవుతుంది. నాకు అలాంటి వుద్దేశ్యమే వుంటే వల్లించేవాణ్ని. విదేశాలను వెళ్లేవాన్నికాదు' అని ఇంటికి వచ్చిన తర్వాత అతను తండ్రికలప వ్యాపారపు దుస్థితి చూచాడు. మునుగుతూ తేలుతూ వున్న వ్యాపారాన్ని తన యజమాయిషీలోపెట్టుకున్నాడు. నౌకర్లకు అతనియందు మంచి అభిప్రాయం ఏర్పడింది. గుమాస్తాలకు

అతనంటే సింహస్వప్నం. ఈ వ్యవహారాలలో మునిగి శ్వాసతీర్చుకోటానికికూడా తీరికలేని సమయంలో___గణేశపుర స్థితిగతులు అతని చెవిని పడ్డాయి. 'నాన్నగారు చేసేది ప్రతిదీ ఇలాగే వుంటుంది, ఇక నిగ్రహించేస్తే లాభంలేదు తను స్వయంగా చూచి ఏదైనా ఏర్పాట్లు చెయ్యాలనే వుద్దేశ్యంతో అతను గణేశపురం వచ్చాడు. ఈ చిన్నపనికోసం అతనీ వూళ్ళో ఎక్కువ రోజులుండడు. ఏదైనంత త్వరలో దానికేదైనా సరైన ఏర్పాటుచేసి వెళతాడు. వ్యవహారాలన్నీ అతనొక్కడి నెత్తిన పడినాయి. అన్న అజయుడు ప్లీడరు. అతి స్వార్థపరుడు. తన ఆఫీసుపనులు తాను చేసుకుంటూ కుటుంబ విషయాలలో ఏమీ జోక్యం లేకుండా తన పెళ్ళాం బిడ్డలతో సుఖంగా వుంటున్నాడు. అతని భార్య ప్రభావతి కలకత్తా విశ్వవిద్యాలయ పట్టభద్రురాలు. కన్నవారి మంచిచెడ్డలు తెలుసుకోటం అటుంచి అత్తమామలు బ్రతికున్నారో లేదో తెలుసుకోటానికికూడా ఆమెకు అవకాశం వుండదు. వారుండే అయిదారుగదుల పట్టున ఇంట్లో ఇంకెవ్వరూ అడుగుపెట్టటానికి కూడా వీలులేదు. వారి నౌకర్లూ, వారి చాకర్లూ వేరు. పెదబాబు ఒప్పుకోపోటంవల్ల ఇంతవరకు ఒక తురకవంటవాణ్ణిమాత్రం పెట్టలేకపోయారు. మామ చనిపోగానే ఆ కొరతకూడా తీర్చవచ్చునని ప్రభావతి ఆశ. విజయునియందు ఆమె ఎప్పుడూ ఏవగింపుతో ఉండేది. అతను విదేశాలనుండి తిరిగి వచ్చినదగ్గరనుండీ ఆమెమనోభావంలో కొంత మార్పు కలిగింది. ఒక రోజున మరదిని విందుకు పిలిచి తన చేతితో వడ్డించింది. ఆసమయంలోనే తన చెల్లెలు అనితను విజ

యుని పరిచయంకూడా చేసింది. యిప్పుడామె బి.ఏ ప్యాసయి, ఎం. ఏ. చదవటానికి వెళ్ళబోతూంది.

విజయుడు విధురుడు భార్య చనిపోయాకే విదేశాలకు వెళ్ళాడు. అక్కడ ఏమిచేశాడో, ఏమి చెయ్యలేదో అన్న విషయం ఇప్పుడు అప్రస్తుతం. కాని తిరిగి వచ్చిన తర్వాత కొంత కాలంవరకుమాత్రం అతని భావం స్త్రీజాతియందు కొంచెం కటువుగా వుండేది. తల్లి పెళ్ళిచేసుకోమని చెప్పి నప్పుడు—ఆమెకు ఏవేవో చల్లనిమాటలు చెప్పి సమాధాన పర్చేవాడు. ఇప్పటివరకు ఆ విషయం అడుగున పడిపోయింది.

గణేశపురం వచ్చాక అతను ఒక గృహస్థుని యింట్లో ముందువెపు గదులు తీసుకొని క్రొత్త కచేరి పెట్టాడు. గగనుని ఇంట్లో దొరికిన కాగితాలన్నీబలవంతంగా ఇక్కడికి తీసుకొచ్చారు. ఇక అనూరాధను, ఆమె చెల్లెల్ని ఇంట్లోంచి గెంటించాలని ప్రయత్నిస్తున్నారు. వినోదఘోషుని యిప్పుడు ఈవిషయాన్ని గురించేసలహాలడుగుతున్నారు.

కలకత్తానుండి వచ్చేటప్పుడు విజయుడువెంట తనపదేళ్ల కొడుకు 'కుమార్'ని కూడా తీసికొచ్చాడు.

పల్లెటూళ్ళో పురుగూబుట్రా వుంటాయనేభయంతో తల్లి అడ్డుపెట్టింది. "నీపెద్దకోడలి కృపవల్ల నీ మనమలకేమీ కొదువలేదు. కనీసం వీణ్నయినా అలా తయారు చెయ్యాను. కష్టసుఖాలలో రాటుతేలి మనిషిగా తయారుకాని అమ్మా" అని కుమారుని వెంట తీసుకు వచ్చాడు.

విదేశీయులుకూడా సరిగ్గా అలాగే అంటూ వుంటారని వినికిడి. కాని వారి మాటలకంటే దీనిలో మరికొంత గాఢ

రహస్య ముంది. విజయుడు విదేశాలలో వుంటున్నప్పుడు — ఈ తల్లిలేని బిడ్డజీవితం ఆదరణ లేమీ లేకుండా కఠినంగా గడిచింది. దాది ఏనాడూ మంచం వదిలేదిగాదు. ఎంత సహాయ సంపత్తు లున్నాకూడా అతన్ని ఆదరించి పెంచే దిక్కు లేకపోయింది. పాపం, కష్టాలమధ్యే ఇంతో పెద్దవాడయ్యాడు. విదేశంనుండి తిరిగి వచ్చిన తర్వాత ఈ సంగతులు అతని చెవిని పడ్డాయి.

గణేశపురంకు బెలుదేరబోయేప్పుడు వదిన విచారం కనపరుచుతూ "కుర్రవాణ్ణికూడా వెంట తీసుకెళుతున్నారు. పల్లెటూరు కాబోలు, కొంచెం జాగ్రత్తగా వుండాలిసుమా! ఇంతకీ వచ్చేది ఎప్పుడు?" అన్నది.

"వీలైనంత త్వరలోనే..."

"మనకు అక్కడ ఒక ఇల్లు వుందనికూడా విన్నాను. బాబుగారు కొన్నారా ఏమిటి?"

"కొంటానికి కొన్నారుగాని, దానిమీద మనకు అధికారం లేదు."

"ఇప్పుడు నువ్వు వెళుతున్నావుగా. స్వాధీనంకాక ఏమౌతుంది?"

"నేనూ అలాగే అనుకుంటున్నాను."

"స్వాధీనమైన తర్వాత కొంచెం కబురు చెయ్యండి."

"ఎందుకు?"

"పల్లెటూళ్లు ఎప్పుడూ చూడలేదు. ఎప్పుడైనా ఒకనాడు చూచివద్దామని. దగ్గరేగా! అసితకు కాలేజీకూడా లేదు. ఆమె కూడా వెంట వస్తానంటోంది."

దానిమీదట విజయుడు వుప్పొంగిపోయి, "స్వాధీనం కాగానే కబురు పంపిస్తాను వదినా. ఇదిగో! అప్పుడుమాత్రం కాదు, గీదు అని ఏమీ అనవుకదా! మీ చెల్లిని తప్పకుండా తీసుకురావాలి" అన్నాడు.

అనీత తరుణవయస్క. చూట్టానికి అందంగానే వుంటుంది. బి. ఏ. కూడా ప్యాసయింది. విజయుని మనస్తత్వం స్త్రీజాతిని ఏవగించుకొనేదైనా—ఒక్క రమణిలో ఇన్ని గుణాలు ఇమిడి వున్నవని అత నీ విధమైన స్వభావం కలిగివుండటం. ఆ పల్లెసీమల్లోని ప్రాచీన ప్రకృతిశోభను, ఆ విశాల వృక్షచ్ఛాయల్ని, ఆ సౌందర్యమూర్తికి చూపించాలన్న కోర్కె అతని హృదయాన్ని ఊయ్యల లూపసాగింది.

౨

విజయుడు అచ్చమైన విదేశీమస్తులు ధరించి, తలను హేటూ, నోట్లో సిగరెట్టూ, జేబులో రివాల్వరూ పెట్టుకొని చేతిలో కొరడా తిప్పుతూ ఘురానా కుటుంబీకుల యింటికి వచ్చాడు. వెంట సాయుధపాణులైన ఇద్దరు జవాన్లూ, వినోద ఘోషు, కొడుకు 'కుమారు', మరి కొంతమంది పూరప్రజా వచ్చారు. ఆస్తి స్వాధీనపర్చుకొనటంలో కొంత ఘర్షణ జరుగుతుందని తెలిసివుండికూడా, కొడుకును పిరికివాడిగా చెయ్యటానికి ఇష్టంలేక ధైర్యసాహసాలు నేర్పటానికి ఇది ప్రథమ పాఠమను ఉద్దేశంతో కుమారును వెంట తీసుకువచ్చాడు. అనూరాధ ఒంటరిది, ఆడది. ఇంత హంగామా అనవసరమని వినోదు డన్నా

కూడా – గినాల్వారు పుస్తకాలను వెంట తీసుకొస్తేనే మంచిదని తీసుకొచ్చాడు.

"ఆ పిల్ల చాల గడుసుదని విన్నాను. నిమిషంలో పోగు చేస్తుందట జనాన్ని. గగనునికి కూడా సలహా లిచ్చేది ఆమేనట. గుణం కూడా అంతమంచిది కాదట" అన్నాడు విజయుడు.

"లేదే! అలాంటివి ఎప్పుడూ వినలేదు" అన్నాడు వినోద్.

"నేను విన్నాను."

ఇంటిముందు కొచ్చారు.

ఎవరూ కనపడలేదు. విజయుడు వరండాలో నిలబడి ఇటూ అటూ తేరిపారజూస్తున్నాడు. కిలవారి యిల్లల్లే వుంది! ఎదురుగా తులసికోట వుంది. ఇంకా పడిపోలేదుగాని, దాదాపు శిథిలావస్థలో వుంది. ఒకవైపున కచేరీగది వుంది. ఇప్పుడది పావురాలకీ, గబ్బిలాలకూ స్థావరమైంది.

"ఎవరైనా వున్నారా?" నౌకరు కేక వేశాడు.

గౌరవశూన్యమైన ఆ కేకవిని అందరికీ సిగ్గనిపించింది. "నేను వెళ్ళి రాధకు చెప్పివస్తాను బాబూ" అని వినోదఘోషు లోపలికి వెళ్ళాడు.

అతని గొంతునుబట్టీ, చెప్పే తీరునుబట్టీ ఇప్పటికి కూడా ఆ యింటిని అగౌరవపర్చటానికి సంకోచం కలుగుతూ వున్నట్లు తెలుస్తూవుంది.

అనూరాధ వంటచేస్తూవుంది. వినోదుడువెళ్ళి వినయంగా "చిన్నబాబుగారు వచ్చి బైటనుంచున్నారు అక్కా" అన్నాడు.

ఈ సదవకాశంకోసమే ఆమె నిత్యమూ ఎదురుచూస్తూ

వుండి. చెయికడుక్కుని లేచి సంతోషును పిలచి "బైట ఒకచాప పరచి, పిన్ని ఇప్పుడే వస్తుంది అని చెప్పు" అని మళ్లా వినోద్‌తో "ఎక్కువ ఆలస్యంకాదు లే, బాబుగారు కోపగించుకుంటారేమో! నా తరఫున క్షమాపణ చెప్పు వినోద్" అన్నది.

వినోదుడు లజ్జితవదనంతో, "నే నేం చేస్తాను అక్కా, మేము బీదరైతులము. జమీందారుగారు చెబితే కాదనలేము. అందుకనే—" అన్నాడు.

"అది నాకు తెలుసు వినోద్!"

వినోదుడు వెళ్ళిపోయాడు. బైట చాపవేశాడు. కాని దానిమీద ఎవరూ కూర్చోలేదు. విజయుడు కోరడా తిప్పుతూ సిగరెట్టు పీలుస్తూ వాకిట్లో పచారుచేస్తున్నాడు.

అయిదారు నిమిషాలకు సంతోష్ వచ్చి వాకిటికేసి చూపిస్తూ భయంతో, "పిన్ని వచ్చింది" అన్నది

విజయుడు చప్పున నిలబడిపోయాడు. ఘరానా కుటుంబపు బిడ్డ. ఏమని పిలవాలా అని గుంజాటనలో ఆలోచింపసాగాడు. కాని తన బలహీనత కనపడినా లాభం లేదనుకుని— అనూరాధను ఉద్దేశించి "ఈ ఇల్లు మాదన్న సంగతి మీకు తెలుసా?" అన్నాడు.

"ఆఁ తెలుసు" అని సమాధానం వచ్చింది.

"అయితే ఎందుకు ఖాళీచెయ్యరు?"

అనూరాధ తలుపుచాటునుండే చెల్లెలిద్వారా సంభాషణ సాగించాలనుకున్నది. కాని ఆ పిల్ల అంత చురుకైనది కాకపోవటంవల్లా, జమీందారుగారి కఠినస్వభావాన్ని గురించి విని భయంతో ఆమె అసలు చెప్పలేకపోయింది. విజయుడు సమాధానంకోసం

ఎదురునుంచి చివరకు విసుగుతో "చెప్పదలచుకున్న దేమిటో మీ పిన్నిని ఎదుటకు వచ్చి చెప్పమను! నేను పెద్దపులినీ, సింహాన్నీ కాదు, ఆమెను అమాంతంగా మింగటానికి. ఇల్లు ఖాళీచెయ్యాని కారణమేమిటో చెప్పమను" అన్నాడు.

అనూరాధ బైటికిరాకుండా అక్కడనుంచే సమాధాన మిచ్చింది. "వెళ్ళిపోవాలన్న షరతేమీ లేదు. లోపలి భాగంలో మేము ఉండవచ్చునని మీతండ్రి హరిహరబాబుగారే చెప్పారు."

"రాతకోత లేమైనా జరిగాయా?"

"లేదు. రాతకోత లేమీ జరగలేదు. కాని వారింకా సజీవులై వున్నారుగా—అడిగితే తెలుస్తుంది."

"నాకు అడగవలసిన అవసరం లేదు. ఈ షరతు వారిచేత ఎందుకు రాయించుకోలేదు?"

"అన్నయ్య అవసరమనుకొని వుండరు. బహుశా పెద బాబుగారి నోటిమాటకంటే రాతకోత లెక్కువని ఆయనకు తోచి వుండదు."

దీనికేమీ సరైన సమాధానం తోచక విజయుడు మెదల కుండా వూరుకున్నాడు. వెంటనే లోపలినుండి మళ్ళీ సమాధానం వచ్చింది.

"ఈ షరతు రద్దయిందంటే అన్ని షరతులూ పోయినట్టే. ఇక మాకు ఈ ఇంట్లో వుండే అధికారం లేదు. కాని నేను ఏకాకి నైపోయాను. ఈ పిల్లకూడా వుంది. తలిదండ్రులుకూడా లేరు. నేనే పెంచి పెద్దదాన్ని చేశాను. మీరు దయతలిచి మమ్మాస్థితిలో ఇక్కడ వుండనియ్యకపోతే ఎక్కడికి వెళ్ళేదామా అని ఆలోచిస్తున్నాను" అన్నది అనూరాధ.

"దీనికి సమాధానం నే నివ్వవలసి వుంటుందా? అయితే మీ అన్నగారు ఎక్కడ వున్నారు?" అన్నాడు విజయుడు.

"ఎక్కడున్నారో నాకు తెలియదు. మిమ్మల్నింతవరకు కలుసుకోలేకపోవటానికి కారణం — మీరు అపహసిస్తారనే భయంవల్లనే" అని ఆమె తమాయించుకుని మళ్లా చెప్పసాగింది.

"మీరు యజమానులు—మీ ముందు ఏమీ దాచను. నా కష్టసుఖాలన్నీ మనవి చేసుకుంటాను. నే నేనాడూ ఈ ఇంట్లోనుంచి కదలనని పంతంపట్టి కూర్చోలేదు. కొన్నాళ్ళపాటుండి నా అంతట నేనే వెళ్ళిపోతాను."

ఆమె గొంతునుబట్టి కంటతడి పెట్టిందని బైట నిలబడియున్న విజయుడు గ్రహించి, చాల బాధపడ్డాడు. మనస్సులో కొంత సంతోషంకూడా కలిగింది. ఈ ఇంటిని స్వాధీనపర్చుకోటానికి ఎన్ని యాతనలు పడవలసివచ్చేనో. ఎంతకాలం పట్టేదో ననుకున్నాడు. వాస్తవంగా అవేమీ జరగలేదు ఆమె కన్నీటితో భిక్షమాత్రం అడిగింది జేబులో పిస్తోలు, నౌకర్ల చేతుల్లో లాఠీలు అతన్నే బాధపెట్టసాగినై. కాని బలహీనత బయటపడితే లాభం లేదు. "వుండనివ్వటానికి నా కభ్యంతరం లేదు. కాని, ఇల్లు నా స్వంతానికి కావలసివుంది. నే నిప్పుడుంటున్న చోట చాల ఇబ్బందులు పడవలసివస్తోంది. అదీగాక మాయింట్లో ఆడవారుకూడా వూరు చూట్టానికి కొద్దిరోజులలో వస్తామన్నారు" అన్నాడు విజయుడు.

"మంచిదే. రానీయండి. బయటగదుల్లో మీరు విశ్రాంతిగా వుండవచ్చు. లోపల రెండో అంతస్తులో చాలా గదులున్నాయి. వారు వుండవచ్చు. ఇబ్బంది ఏమీ వుండదు.

పరాయి చోట వారికికూడా ఇక్కడ సంగతులు తెలిసిన మనిషి ఎవరైనా వుండాలిగా! నేను వారికి అన్నివిధాలా సాయం చేస్తూ వుంటాను" అన్నది అనూరాధ.

ఈసారి విజయుడు చాల సిగ్గుపడి "అవసరం లేదు. మీ రేమీ కష్టపడ నవసరం లేదు. వారివెంట నౌకర్లూ – చాకర్లూ అంతా వస్తారు. అయితే – లోపలకువెళ్లి నే నొకసారి చూచి రావచ్చునా ?" అన్నాడు.

"ఎందుకు చూడకుండడదు! మీ కభ్యంతర మేముంటుంది!" అన్నది.

విజయుడు లోపలికి వెళ్లి క్షణంసేపు ఆమె మొహంకేసి చూశాడు. నెత్తిమీది ముసుగు జారిపోతూవుంది. సగం మాసిన చీర కట్టుకుంది. నగ లేమీ లేవు. చేతులకుమాత్రం రెండు తజలు బంగారపు గాజులున్నాయి. అశ్రుమిశ్రితమైన ఆమె స్వరం విజయుడికి అత్యంతమృదువుగా వినిపించింది. రూపంకూడా అలాగే వుంటుందనుకున్నాడు. పేదదైన కులీన కుటుంబపు బిడ్డగా! కాని చూచినతర్వాత అత ననుకున్నట్లుగా లేదు. రంగు ఎరుపు కాదు, చామనచాయ. కాని కొంచెం నలుపువైపుకే మొగ్గిం దనుకోవచ్చు. పల్లెటూరిపిల్లలు ఎలావుంటారో సరిగ్గా అలాగే ఉంది. ఆమె సోమరితనంగా కాలం గడపదని ఆమె ప్రకృతే చెబుతూవుంది. ఆమె మొహంలో ఒక విధమైన కళ ప్రతిబిం బిస్తూవుంది కళంకరహితమైన సౌందర్య ప్రతిమ.

"నేను వంటపనిలో ఉన్నాను. బాబుగారికి ఇల్లంతా చూపించు వినోద్ !" అన్నది అనూరాధ.

"నువ్వుకూడా రావా అక్కా !"

"రాను."

పైకివెళ్ళి విజయుడు అంతా కలయదిరిగి చూశాడు. గదులు చాలా వున్నాయి. ప్రతి గదిలోనూ పూర్వకాలపు వైభవం కొంత, గొప్ప కనిపిస్తూవున్నది. కొన్ని శిథిలమైపోయినాయి. కొన్ని కాబోతున్నాయి ఇప్పుడు వాటి గొప్పతనం అట్టే కనుపించకపోయినా ఆ గోడల్లో వుండేవి నాటికి విలువ. బయటగదుల్లాగానే ఈ గదులుకూడా శిథిలావస్థలో ఎముకల గూడులా వున్నాయి. పేదరికపు ఛాయలు ప్రతి వస్తువుమీదా బాగా దట్టంగా అలుముకున్నాయి

విజయుడు కిందకు వచ్చినతర్వాత అనూరాధ వంటింటి వాకిట్లోకి వచ్చి నుంచున్నది. పేదరికంలో ఉన్నా ఆమె ఘరానా కుటుంబపు బిడ్డగనక ఆమెను 'నువ్వు' అని సంబోధించటానికి విజయునికి వెలితిపనిపించింది. "మీరు ఈ ఇంట్లో ఇంకెంత కాలం ఉండదలచుకున్నారు?" అన్నాడు.

"ఇప్పుడు సరిగ్గా చెప్పలేను. మీరు దయతలచి ఉంచినన్నాళ్ళు—"

"కొంతకాలంపాటు ఉండవచ్చును కాని, ఎక్కువ కాలం ఉంటానికి వీలుండదు. అప్పుడు మళ్ళా ఎక్కడికి వెళతారు?"

"అదే, రాత్రిం బగళ్ళు ఆలోచించేది."

"మీకు గగనుని జాడ తెలుసునని లోకు లనుకుంటున్నారు."

"వారు ఇంకేమేమి అనుకుంటున్నారు!"

విజయుడు ఈ ప్రశ్నకు సమాధానం చెప్పలేకపోయాడు.

"నాకు తెలియదని మీకు మొదటే చెప్పాను. ఒకవేళ

తెలిసినా అన్నను పట్టించి యిచ్చానా? ఇదేనా మీ ఆజ్ఞ?"
అన్నది అనూరాధ.

ఆమె స్వరంలో తిరస్కారభావం కనపడింది. విజయుడు చాల సిగ్గుపడ్డాడు. జాత్యభిమానం ఆమెలో ఇంకా చావలేదనుకున్నాడు. "మిమ్మల్ని ఆపని చెయ్యమని నే ననటం లేదు. శక్తి వుంటే నేనే స్వయంగా అతన్ని వెతికి పట్టుకుంటాను. ఇంతకాలం నుండీ మా సర్వనాశనం చేస్తున్నదికూడా తెలియదు మీకు?" అన్నాడు.

సమాధానమేమీ రాలేదు. "ఇక ముందు ప్రపంచంలో కృతజ్ఞత అనే మాటైనా వుంటుందా? ఎప్పుడైనా దీనిని గురించి మీ అన్నకు సలహా యివ్వలేకపోయారా? మా తండ్రి తిన్నని మాపి. మీ వంశమునందు వారికి అమితమైన గౌరవ మర్యాద లున్నాయి కనుకనే గగనునికి సర్వస్వం అప్పగించారు. దానికి ప్రతిఫలం యిదేనా? నేను దేశంలో వున్నట్లయితే అలా ఎప్పటికీ జరగనిచ్చేవాణ్ణి కాదనిమాత్రం గట్టిగా తెలుసుకోండి" అన్నాడు విజయుడు.

అనూరాధ మెదలకుండా వూరుకుంది. ఏ మాటకూ సమాధానం రాకపోయేప్పటికి విజయుడు లోలోన చాల శోక పడ్డాడు. అతనిలో ఉద్భవిల్లిన కరుణంతా భస్మమైపోయింది. "నేను కఠినుడననీ, అనవసరమైన దయాదాక్షిణ్యాలు నాలో లేవనీ, తప్పు చేసి నాచేతినుండి ఎవరూ తప్పించుకోలేరనీ అందరికీ తెలుసు. అన్నగారు కనపడితే కనీసం ఈ విషయమైనా చెప్పండి" అన్నాడు.

అనూరాధ అలాగే మౌనంగా వుండిపోయింది. "ఇవ్వాళ నుంచి ఇల్లంతా నా స్వాధీనమైపోయింది. బైట గదులు బాగు చేయించిన తర్వాత రెండు మూడు రోజుల్లో ఇక్కడికే వస్తాను. ఆడంగులు ఆ తర్వాత వస్తారు. మరెక్కడకూ. వెళ్ళలేనంతవరకు మీరు కిందగదిలో వుండండి. ఏ వస్తువూ దాచెయ్యటానికి మాత్రం ప్రయత్నించకండి" అన్నాడు విజయుడు.

ఇంతలో కుమార్ "దాహంమహాతూ వుంది. మంచినీళ్లు నాన్నా?" అన్నాడు.

"ఇక్కడ మంచినీళ్ళెక్కడివి?"

అనూరాధ చేతిసైగతో అతన్ని తనదగ్గరకు పిలిచి వంటిం ట్లోకి తీసుకెళ్లి, "కొబ్బరి బొండాంనీళ్లు తాగుతావా బాబూ?" అన్నది.

"ఆఁ, తాగుతాను."

సంతోష్ బొండాం కొట్టి ఇచ్చాడు. కుమార్ నీళ్ళన్నీ కడుపునిండా తాగి, పచ్చికొబ్బరి తీసుకు తిన్నాడు. "చాల తియ్యగావున్నాయి. నువ్వుకూడా తాగుతావా నాన్నా?" అన్నాడు బైటికివచ్చి.

"తాగను."

"తాగరాదు నాన్నా? చాలా వున్నాయ్! అంతా మనదేగా!"

ఇంతమంది ముందు కుర్రవాడి నోటినుండి వచ్చిన ఈ మాటవిని అతను చాల సిగ్గుపడి "వద్దు. తాగను, నువ్వు పద" అన్నాడు.

## 3

ఇల్లు స్వాధీనం చేసుకొని విజయుడు పీఠం వేసుకు కూర్చున్నాడు. రెండు గదులు మాత్రం తను ప్రత్యేకంగా వుంచు కొని తక్కిన భాగమంతా కచేరీకింద వుంచాడు. వినోదఘోషు ఒకప్పుడు జమీందారువద్ద ఉద్యోగం చేసివున్నాడు. ఆ సాంప్ర దాయాన్ననుసరించే అతను కొత్తగుమాస్తాగా నియమించినా చిక్కులు వదలలేదు. గగనచటర్జీ వసూలుజేసిన డబ్బుకు రసీదు లివ్వడం అనుమానకర మనుకోవటమే దీనికి ముఖ్యకారణం. ఎందు చేతనంటే దానిలో అపనమ్మకపు ఛాయలుంటాయి. అది చట ర్జీల వంశానికి గౌరవప్రదం కాదు. దీనిమూలకంగా అతను పరా రైన తర్వాత రైతులు చాల చిక్కుల్లో పడ్డారు. సాక్ష్యాలు, ప్రమాణాలతో ప్రజలు హాజరౌతున్నారు. కంటతడి పెట్టుకుంటు న్నారు, తుడుచుకుంటున్నారు. ఎవరు ఎంత ఇచ్చారో, ఎవరెంత బాకీవున్నారో నిర్ణయించటం చాల కష్టంగా ఉంది. విజయుడు ఎంత తొందరగా కలకత్తా తిరిగి వెళదామనుకుంటున్నాడో అంత తొందరగా వెళ్ళలేకపోయాడు. ఇవ్వాళ-రేపు అంటూవుండగానే పదిహేనురోజులు గడిచిపోయాయి.

ఇటు కొడుక్కీ సంతోష్‌తో స్నేహం కలిసింది. వయ సులో అతను రెండు మూడేళ్ళు చిన్న కాని, సాంఘిక సంబంధాలు మాత్రం పెద్దవి. ఇంకెవరూ లేకపోయేప్పటికి అతను వారితో కలసి మెలసి పోయాడు. వారివద్దే ఇంట్లో వుంటూ వుంటాడు. తోటలూ - దొడ్లూ, చెట్లూ - పుట్టలూ తిరుగుతూ వుంటారు.

వచ్చి మామిడికాయలూ, పిచ్చిక గూళ్లూ వెతుక్కుంటూ సంతోష్ అక్కడగ్గరే తరచుగా అన్నం తింటూ వుంటాడు. ఇరుగుపొరుగువారిని చూచి అనూరాధను 'పిన్నీ!' అని కూడా పిలువసాగాడు. విజయుడు డబ్బా-దస్కం లెక్కల చిక్కుల్లోపడి కొడుకు అజమాయిషీ తీసుకోటానికే తీరటం లేదు. తీరిక దొరికి అజమాయిషీ కనుక్కుందా మనుకునేప్పటికి వాడు కనపడేవాడు కాదు. ఎప్పుడైనా ఒకనాడు గదుముకొని దగ్గర కూర్చోబెట్టు కున్నా, కాస సంము దొరికేప్పటికి ఒక్క గంతులో వెళ్ళి పిన్ని గారి వంటింట్లో దూరేవాడు. మధ్యాహ్నపూట సంతోష్‌తో పాటు పప్పూ అన్నం తినేవాడు. సాయంకాలం రొట్టె, కొబ్బరి కాజా —

ఆరోజు సాయంత్రం ఆసామి లెవరూ రాలేదు. విజయుడు కాఫీ తీసుకొని సిగరెట్టు కాలుస్తూ ఏటిమొగ్గుకు షికారు వెళ్ళి వద్దామనుకుంటున్నాడు. తలవని తలంపుగా కొడుకు సంగతి జ్ఞాపక మొచ్చింది. ఇవ్వాళ పగలల్లా కనపడలేదు. నౌకరుని పిలచి "కుమార్ ఎక్కడ ఉన్నాడురా?" అన్నాడు.

అతను చేతితో అనూరాధ ఇంటికేసి చూపించి "ఆ కొంప!" అన్నాడు.

"ఇవ్వాళ అన్నం తిన్నాడా?"

"లేదు."

"ఎందుకు పెట్టలేదు?"

"ఇక్కడ తినడు బాబూ! తిననంటూ చిమ్మిరా కేస్తాడు."

"రేపటినుంచీ నేను భోంచేసేటప్పుడు వాడిని నా దగ్గర కూర్చోబెట్టు" అని అతను మనసులో ఏమూలో చింతపడుతున్నాడో

ఏమో, పీకాయనూని తిన్నగా లోపలికి వెళ్ళాను. నసారా లోంచి కొంచుకుగొంతు వినపడుతూవుంది. "పిన్నీ, ఇంకొక రొట్టి, రెండు లడ్డూలూ......త్వరగా"

"దిగిరా నాయనా! మీలాగ నేను చెట్లు ఎక్కగలనా?" అంటూన్నది అనూరాధ.

"ఎందుకు ఎక్కలేవు పిన్నీ? కష్టమేమీ లేదు. ఆ పెద్ద కొమ్మమీంద కాలువేసి, ఈ చిన్నకొమ్మ పట్టుకుని చప్పున ఎక్కిరా!" అంటున్నాడు కుమార్.

విజయుడు దగ్గరకువచ్చి నుంచున్నాడు. వంటింటి ముందు ఒక పెద్ద మామిడిచెట్టు వుంది. కుమార్, సంతోష్ వాటి కొమ్మలమీద కూర్చుని కాళ్ళు వేళ్ళాడవేసి కులాసాగా తింటు న్నారు. విజయుణ్ణి చూడగానే ఇద్దరూ ఒక్కసారి తెల్లబోయారు. అనూరాధ వంటింటి తలుపు చాటుకువెళ్ళి నుంచున్నది.

"వీళ్ళు తిండి తినేచోటు ఇదేనా?" అన్నాడు విజయుడు.

ఎవరూ మాట్లాడకపోయేప్పటికి విజయుడు లోపలి వ్యక్తి నుద్దేశించి, "మీామీాద మహా అమలు చేస్తున్నట్లున్నాడే!" అన్నాడు.

ఈసారి అనూరాధ మృదుస్వరంతో "అవును" అని సమాధాన మిచ్చింది.

"అయినా అంత నెత్తిన ఎక్కించుకుంటూ రెందుకు?"

"ఇంకా అల్లరి చేస్తాడనే భయంవల్ల."

"కాని ఇటివద్ద ఏమీ చెయ్యడేం?"

"చెయ్యకపోతే చెయ్యకపోతూ వుండవచ్చు. అయినా ఎవరివద్ద చేస్తాడు? తల్లి లేదాయె. ముత్తవ ఉంటే ఎప్పుడూ

మాగన్నుపడి ఉంటుంది. ఎక్కడి తెలియని గిన స్వప్నవిహారాలలో గాలి పీల్చటం కూడా తీరక తెలియకుండా వుంటాను!"

విజయుడికి ఈ సంగతి తెలియనిది కాదు. కాని తన బిడ్డకు తల్లి లేనప్పటి మాట గుర్తుల నోటితో విని చాల వ్యధపడ్డాడు. "మీకు చాల సంగతులు తెలుసున్నట్లు వున్నాయి. ఎవరు చెప్పారు? కుమారా?" అన్నాడు.

"అతనికి చెప్పగల ఓపిక లేకపోయినా తెలుసుకున్నది మట్టుకు అతని మాటలనుబట్టే. మధ్యాహ్నం పూట వాళ్లు ఎండలోకి వెళ్లిపొయ్యారు. అయినా మరపించి పోతూ నేవుంచాను. వెళ్ళిపోయే రోజున నా పక్కలో పండుకొని ఇట్లో కబుర్లు చెబుతూ వున్నాడు."

ఆ మొదటి రోజులాగానే ఇవ్వాళకూడా ఆమె కంఠ స్వరం చాల మృదువుగా ఉంది. అనాలని లేకుగాని ఆమె కంఠ స్వరం మరోకసారి వినాలనే ఉద్దేశంతో, "ఇంటికి వెళ్ళిన తర్వాత ఈసారి కుమార్ చాల బాధపడతాడు" అన్నాడు.

"ఎందుకని?"

"అల్లరి చెయ్యటమనేది ఒక మత్తుమందు లాంటిది. అల వాటు పడినవాడు మెదలకుండా వుండాలంటే బాధగా ఉంటుంది. ఉత్సాహం వుండదు. అక్కడికి వెళ్ళినతర్వాత వాడికి ఈ మత్తు మందు సమకూర్చి పెట్టేవా రెవరుంటారు? రెండు రోజులలో మారిపోయి చక్కావస్తాడు."

"లేదు, మర్చిపోతాడు. దిగిరా నాయనా! వచ్చి రొట్టె తీసుకెళ్ళు" అన్నది అనూరాధ మెల్లగా.

కుమార్ పళ్ళెం చేతోపట్టుకుని దిగివచ్చాడు. పిన్ని చేతిలోంచి మరికొన్ని రొట్టెలూ, లడ్డూలూ తీసుకొని తింటూ ఆమె ఆనుకొని నుంచున్నాడు. అవి జమీందార్లు తినదగ్గ రొట్టెలు కాకపోయినా వాటిలో ప్రేమామృతము నిండివుందని గ్రహించాడు విజయుడు. "నిన్న చేసిన వెన్నముద్దలు ఇవ్వాళ కూడా చేస్తానని చెయ్యలేదే పిన్నీ?" అన్నాడు కుమార్.

"మర్చిపోయాను నాయనా! కొంచెం ఆదమరచి ఇటు వచ్చేప్పటికి పిల్లి పాలు పారబోసిపోయింది. రేపు తప్పకుండా చేస్తానులే" అన్నది అనూరాధ.

"ఏ పిల్లి పిన్నీ? తెల్లదా?"

"అదే నాయనా!" అని అనూరాధ అతని ముంగురు లను నిమురుతూ నుంచున్నది

ఈ అల్లరి చూస్తూవుంటే ముందుముందు మొండితనంగా పరిణమిస్తుందేమో ననిపిస్తూవుంది" అన్నాడు విజయుడు.

ఇంతలో కుమార్ "మంచినీళ్ళేవీ?" అన్నాడు

"మర్చిపోయాను బాబూ! ఇదిగో తెస్తున్నాను."

"నువ్వు అన్నీ మర్చిపోతావు పిన్నీ! నీకేం జ్ఞాపక ముండదు."

"మీకు దెబ్బలు తగలాలి. అడుగడుగుకీ మర్చిపోతూ ఉంటారు" అన్నాడు విజయుడు.

"మరే!" అని అనూరాధ నవ్వింది. అజాగ్రత్తగా ఉండటం మూలంగా ఆ నవ్వు విజయుడు చూచాడు. కొడుకు చేస్తున్న అల్లరికి క్షమాపణ చెప్పాలనుకుందా మనుకున్నాడు. కాని ఆమె మరోవిధంగా భావిస్తుందేమో? తన లేమిలో, కష్టపు

రోజుల్లో కటాక్షిస్తున్నావని కించపడుతుందేమో నను సందేహంతో మెదలకుండా వూరుకున్నాడు.

మర్నాడు ఉదయాన అనూరాధ కుమార్. సంతోష్‌లకు అన్నం వడ్డించి కూర వడ్డించుతూవుంది. నెత్తిన ముసుగు లేదు. హఠాత్తుగా వాకిటివద్ద ఎవరిదో నీడకనపడింది. తలెత్తి చూచింది–చిన్న బాబు. చప్పున నెత్తిన ముసుగు వేసుకొని లేచి నుంచున్నది.

"ఒక ముఖ్యమైన సలహాకోసమని మీ వద్దకు వచ్చాను. వినోదఘోషు ఈవూరివాడే మీరు అతన్ని బాగా ఎరుగుండి వుంటారు. అతన్ని గణేశపురానికి కొత్త గుమాస్తాగా వేయాలను కుంటున్నాను. అతన్ని సంపూర్ణంగా నమ్మి ఉండవచ్చునా? లేదా? మీ సలహా ఏమిటి?" అన్నాడు విజయుడు.

వినోదుడు పనిలో ప్రవేశించి వారంరోజులుం పైదాటింది. చేతనైనంతవరకు బాగానే చేస్తున్నాడు. ఏవిధమైన గల్లంతూ లేదు. ఈమధ్యలో అతని గుణగణాలను తెలుసుకోవలసినంత అవసరమేమి వచ్చిందో అనూరాధకు అర్థంకాలేదు. మృదుస్వరంతో "వినోదబాబు ఏమిచేశాడేమిటి?" అన్నది.

"ఇంతవరకూ ఏమీ చెయ్యలేదు. కాని జాగ్రత్తగా ఉండటం మంచిదిగా!"

"అతను చాల మంచి మనిషని నా ఉద్దేశం"

"నిజమైన ఉద్దేశమేనా? అతనిమీద నింద మోపటానికి ఇష్టంలేక మంచివాడంటున్నారా?"

"నేను మంచన్నా, చెడ్డన్నా ఏమైనా విలువుంటుందా?"

"ఎందుకు ఉండదు! అతను మీరే సరైన నిర్ణయకర్తని చెప్పాడు."

అనూరాధ కొంచెం ఆలోచించి "అతను మంచి మనిషే. అయినా ఒక కంటితో కనిపెడుతూ వుండండి మీ నిర్లక్ష్యం మూలాన మంచి మనిషికికూడా దుర్బుద్ధి పుడితే పుట్టవచ్చు" అన్నది.

"ఆ సంగతి నిజమే., నేరాలన్నిటికీ కారణాలు వెతుకుతూ కూచుంటే చాలావాటికి నోరు మెదల్చటానికి కూడ వీలుండదు" అన్నాడు విజయుడు.

మళ్ళీ కొడుకు నుద్దేశించి, "నీ అదృష్టం మంచిదిరా! తలవని తలంపుగా ఒక పినతల్లిని సంపాయించావు. లేకపోతే ఈ అడవిలో సగంరోజులు పస్తులు పండుకోవలసి వచ్చేది" అన్నాడు.

"మీకు ఇక్కడ భోజనానికి ఇబ్బందిగా వుందా ఏమిటి" అన్నది అనూరాధ మెల్లగా.

విజయుడు నవ్వుతూ "ఏమీ లేదు. ఊరికినే అన్నాను. జీవితమంతా పరదేశాలలో గడిపాను. ఇలాంటి ఇబ్బందులు అనేక సమయాల్లో అనేకములు వచ్చినవి. అయినా, వాటిని నేను ఎక్కువ లెక్కచేయను" అని బయటకు వెళ్ళిపోయాడు. అనూరాధ కిటికీలోనుండి చూచి అతనింకా స్నాన, భోజనాదులు చేయలేదని గ్రహించింది.

౪

ఆ యింటికి వచ్చినతరువాత అతనికి ఒక పాత పడక కుర్చీ దొరికింది. సాయంత్రం వేళ దానిమీద కాళ్ళారచాపుకొని, కళ్ళు మూసుకుని సిగరెట్టు పీలుస్తున్నాడు. ఇంతలో "బాబు గారూ" అన్న పిలుపు చెవిని పడింది. కళ్ళు తెరచి చూచాడు.

ఎదురుగా ఒక వృద్ధుడు నిలబడి ఉన్నాడు. వయస్సు అరవై సంవత్సరాలకు పైదాటి ఉంటుంది. కాని శరీరము మాత్రము కాయలాగ ఉన్నది. మీసాలు నెరసినవి. కాని మధ్య మధ్య నల్ల వెంట్రుకలు తుమ్మెదవలె మెరుస్తున్నవి. ముందు పళ్లు రెండు మూడుతప్ప తక్కినవన్నీ గట్టిగానే ఉన్నవి. ఒంటిమీద సిల్కు కోటు, పైన కండువా, కాళ్ళకు సైనాచెప్పులు ఉన్నవి. జేబు గడియారపు గొలుసులో పులిగోరు వ్రేలాడుతోంది. ఈ పల్లె ప్రాంతాల్లో అతను ధనవంతుడులాగ కనపడుతున్నాడు. విజయుడు లేచి కూర్చుని కూర్చోమని ఎత్తుపీట చూపించాడు. వృద్ధుడు "నమస్కారం" అని కూర్చున్నాడు.

"నమస్కారం."

"తమరు ఈ వూరి జమీందారులు. తమ తండ్రిగారు ఖ్యాతిగల లక్షాధిపతి. పేరు తెలుసుకుంటే చాలు. మీరు వారి సుపుత్రులు. పాపమా పిల్లయందు దయ చూపకపోతే అనేక యాతనలను లోనవ్వాలిసి వస్తుంది" అన్నాడు వృద్ధుడు.

"ఆ పిల్ల ఎవరు? ఎంత ఇవ్వవలసి వుండేమిటి?"

"బాకీని గురించేమీ కాదు. నేను చెప్పేది అమరచటర్జీ గారి కుమార్తెను గురించి. చాల ఉత్తమురాలు, గగనచటర్జీకి మూరుటి చెల్లెలు. ఈ ఇల్లు ఆమె తండ్రి కట్టించింది. కాని ఇక్కడేమీ వుండదు. నాలుగు రోజులుండి వెళ్ళిపోతుంది. ఆ ఏర్పాట్లన్నీ అయాయి. ఈ నాలుగు రోజులకే తమరు మొదపట్టించి వెటను గెంటించటం తగునా?" అన్నాడు వృద్ధుడు.

ఈ అశిక్షిత వృద్ధునిమీద కోపగించుకున్నా లాభం లేదని విజయుడు గ్రహించాడు. కాని అతను మాట్లాడే మాటల ధోరణ

ణానిబట్టి కాకపడక తప్పలేదు. "తగునో కాదో, దాన్ని నిర్ణయించుకునేవాణ్ణి నేను. ఆమె తరఫున వకాలతు పుచ్చుకోటానికి నువ్వెవరవు?" అన్నాడు.

"నా పేరు త్రిలోచన గంగోపాధ్యాయులు. ఈ ప్రక్క గ్రామం, మహేశపురంలో మా కాపురం. నన్నెరుగనివారెవరూ లేరు. మీ తండ్రిగారి ఆశీర్వాదంవల్ల నా ముందు చెయిజాపనివాడు ఈ ప్రాంతంలో దొరకటం కష్టము. మీకు నమ్మకం లేకపోతే వినోదఘోషు నడగండి" అన్నాడు వృద్ధుడు.

"అంత అవసరంవస్తే నేనే మీవద్దకు వస్తానులే. ఆమె తరఫున వకాలతు తీసుకోటానికి, అసలు మీకు ఆమెకు ఏమవుతారో తెలుసుకోవచ్చునా?" అన్నాడు.

వృద్ధుడు కొంచెం ముసిముసి నవ్వులునవ్వుకొని "భర్తను. వచ్చే వైశాఖమాసం నెల్లోగానే వివాహం చేసుకుంటాను." అన్నాడు.

విజయుడు స్తబ్ధుడై, "అనూరాధను మీరు వివాహం చేసుకుంటారా?" అన్నాడు.

"అవును. అదే నా దృఢసంకల్పం. జ్యేష్ఠమాసం వెళ్ళినతర్వాతకాని మంచి లగ్నాలులేవు. లేకపోతే ఆ మూడు ముళ్లూ ఈ నెలలోనే వేసేపని. ఇక్కడ ఉండనివ్వను. మిమ్మల్ని బ్రతిమాల నవసరమూ వుండేదికాదు."

విజయుడు కొంచెంసేపు మెదలకుండావుండి "ఈ సంబంధం కుదిర్చింది ఎవరు? గగనచటర్జీయా?" అన్నాడు.

వృద్ధుడు కోపంతో కాకపడి "ఆ దొంగ వెధవా? జమీందారీ సర్వనాశనంచేసి పరారయ్యాడు. ఇంతకాలంనుండి వాడేగా

అడ్డుతగులుతూ వచ్చింది. లేకపోతే ఈ మార్గశిర మాసంలో వివాహమైపోయేది. మేము ఉత్తమ వంశీయులము. శ్రీకృష్ణుని సంతానం. మీ ఇంట పిల్లనివ్వము. ఇవి అతనన్న మాటలు. ఇప్పుడా షాంబికము ఏమైందో? చివరికి వారింటే పిల్ల నివ్వాల్సి వచ్చిందే! ఈ కాలంలో కులగోత్రాలను ఎవరాలోచిస్తున్నారు బాబూ? డబ్బే కులాలు, డబ్బే గౌరవం, డబ్బే సర్వస్వం; అవునా బాబూ!" అన్నాడు.

"అవునుగాని, అనూరాధ ఒప్పుకుంటా?" అన్నాడు విజయుడు.

వృద్ధుడు సగర్వంగా మీసం మెలివేసి "ఒప్పుకోకపోటమా? ఏమంటావు బాబూ? పట్టణంనుంచి మీరు వచ్చి ఒక్క కసురు కసిరేప్పటికి ఇంకేముంది? కళ్ళముందు అంతా అంధకారంగా కనపడింది. లేకపోతే నా సంకల్పమే ప్రండేదికాదు. కోడలికుల క్కిష్టంలేదు, కోడళ్ళకు యిష్టంలేదు. కూతుళ్ళూ—అల్లుళ్ళూ అంతా విముఖంగా వున్నారు. నేనుకూడా—'పోనీలే, ఇప్పటికే రెండు సార్లు గృహస్థులమయ్యాం కదా' అనుకున్నాను. కాని రాధే స్వయంగా నా వద్దకు 'గంగో మహాశయా! మీ పంచను స్థానమివ్వండి. చాకిరీచేసుకు బ్రతుకుతాను" అని కబురంపించిది. ఇంకేం చేస్తాను! ఒప్పుకోక తప్పలేదు" అన్నాడు.

విజయుడు మాట్లాడలేదు.

"వివాహం ఈ యింట్లోనే జరగాలి. చూట్టానికి బాగుండదు. లేకపోతే మా ఇంటివద్దనే చేసుకుందును. గగనచటర్జీకి ఎవరో పినతల్లి వుందట. ఆమె కన్యాదానం చేస్తుంది. ఇక మీ

గొక్కరు ఒప్పుకున్నట్లయితే అంతా కుదిరిపోయినట్టే” అన్నాడు వృద్ధమహాశయుడు.

విజయుడు తల పైకెత్తి, “ఒప్పుకోని నేనేం చెయ్యాలో చెప్పండి. నేను యిల్లు ఖాళీచెయ్యమని తాకీదు యివ్వకుండా వుండటమేగా! సరే, అలాగే చేస్తాను. ఇక రు మీూ వెళ్ళవచ్చు. సెలవు!” అన్నాడు.

“సెలవు! మహాప్రభూ సెలవు! అది ఎలాగూ వుంది. మీూ తండ్రిగారు లక్షల కనకారి, చల్లని ప్రభువు. తలుచుకుంటేనే శుభం కలుగుతుంది.”

“అలాగే. ఇక తమరు దయచెయ్యండి.”

“అయితే వెళుతున్నాను ప్రభూ — నమస్కారం” అని త్రిలోచనబాబు వెళ్ళిపోయాడు.

వృద్ధమహాశయుడు వెళ్ళిపోయిన తర్వాత విజయుడు మెదలకుండా కూర్చుని — ‘దీనిలో బుర్ర పగులగొట్టుకునేంత అవసరమేముంది! వాస్తవంగా ఇంతకుతప్ప ఆ పిల్లకు మరొక ఆధారమేముంది! లోకంలో ఇంతకుముందు జరగనిదంటూ ఏమీూ లేదు. అలా జరుగుతూనే వుంటాయి. ఇంకా దానికోసం చింత దేనికి!’ అని ఆలోచిస్తున్నాడు. తలనని తలంపుగా అతనికి ఆరోజున వినోదఘోషు చెప్పినమాట జ్ఞప్తికి వచ్చింది. ఒకరోజున అనూరాధ — కులమేమిటి! తిండికీ బట్టకీ కొరతలేకుండా వుంటే అదే పదివేలు—’ అని అన్నతో పోట్లాడుతూ వుందట.

దానిమీూదట గగనుడు క్రోధంతో మండిపడి — “నువ్వు తల్లిదండ్రులపేరు మంటగలప దలచావా ఏమిటి!” అని అడ్డు

తగిలాడట. "వారి వంశజుడివి నీవు పేరు ప్రతిష్ఠలు నిలుపగలిగితే నిలుపు. నేను నిలుప లేను" అని సమాధానమిచ్చిందట అనూరాధ.

ఈ మాటలోని వ్యథను విజయుడు గ్రహించ లేకపోయాడు. కులగోత్రాలయందు నమ్మకం లేదు, కాని ఎందువల్లో అతనికి గగనుడి మీద సానుభూతి కలిగింది. అనూరాధ తీవ్రసమాధానాన్ని స్మరించి మనసులో ఆలోచించింది కొద్ది-సిగ్గునూలిన దానిలా కనపడింది.

బైట వరండాలో క్రమంగా రైతులు పోగౌతున్నారు. ఇక అతను వారితో తన వ్యవహారాలు ప్రారంభించాలి. కాని ఇవాళ అతనికేమీ బాగుండ లేదు. నౌకరుతో చెప్పి వారందరిని ఇళ్ళకు పంపించేశాడు. కచేరీలోకూడా ఒంటరిగా కూర్చో లేక పోయాడు. ఏమి ఆలోచించాడో ఏమో చివ్వున లేచి సరాసరి లోపలికి వెళ్ళాడు. వంటింటిముందు వసారాలో అనూరాధ చాపమీద రెండువైపుల చెరొక బిడ్డను వేసుకు పండుకొని భారతకథ చెబుతూవుంది. రోజూ సాయంత్రం పనులన్నీ త్వరగా ముగించుకు పడుకుని పిల్లలకు కథలుచెబుతూ వుంటుంది. తర్వాత కుమార్‌కి అన్నం తినిపించి తండ్రిదగ్గరకు పంపించుతూ వుంటుంది. వెన్నెల రాత్రి. తమాల వృక్షాల సందుల్లోంచి వెన్నెలపొడ వంటిమీద, మొహంమీదా పడుతోంది. చెట్లనీడల్లోంచి ఎవరో ఒక మనిషి అటు వస్తున్న అలికిడి విని అనూరాధ దిగ్గున లేచి "ఎవరు!" అన్నది.

"నేను విజయుణ్ణి."

ముగ్గురూ తడబడుతూ లేచి కూర్చున్నారు. సంతోష్‌కి చినబాబుగారంటే అమితభయం. మొట్టమొదటిరోజు సంగతి

అతనింతవరకు మరచిపోలేదు. అతను అటూ ఇటూ చూచి ఒక్క పరుగు తీశాడు. కుమార్ కూడా స్నేహితు ననుసరించాడు.

"త్రిలోచన గంగూలీని మీరు ఎరుగుదురా? ఇవ్వాళ నా దగ్గరకు వచ్చాడు" అన్నాడు విజయుడు.

అనూరాధకు చాల ఆశ్చర్యం కలిగింది. "మీ వద్దకా! కాని మీరు వారికేమీ బాకీదారు కాదుగా?" అన్నది.

"కాదు, అయివున్నట్లయితే మీకు చాల లాభంగా వుండేది. నేను ఆ రోజున చేసిన కానికి ఏనాడైనా ప్రతీకారం చేయగలిగేదాన్ని."

అనూరాధ మాట్లాడలేదు. అతను మిమ్మల్ని వివాహం చేసుకోబోతున్నానని చెప్పిపోయాడు నిజమేనా!" అన్నాడు విజయుడు.

"అవును"

"మీరు అతన్ని కాళ్లావేళ్లాపడి యాచించి వప్పించారా?"

"అవును."

"అలాగే చేసివుంటే చాల అవమానకరమైన సంగతి. మీ ఒక్కరికే కాదు, నాకు కూడాను."

"మీ కెందుకు?"

"ఆ సంగతి చెప్పటానికే వచ్చాను నేను. నా వత్తిడివల్లే మీరీ నిర్ణయానికి వచ్చినట్లు త్రిలోచనుడు చెప్పిపోయాడు. మీకు మరెక్కడా నిలవనీడలేక పోయేప్పటికి ఎంతో బతిమాలి-బామాలి అతన్ని వప్పించారట. లేకపోతే అతకీని వృద్ధాప్యంలో వివాహం చేసుకోవాలన్న కోర్కె లేదట. మీరు కాళ్ళావేళ్ళా పడి కంటతడిపెడితే అతను ఒప్పుకోక తప్పిందికాదట."

"అవును. ఇదంతా నిజమే."

"నేను చేసినపనికి క్షమించండి. నా ఒత్తిడిని ఉపసంహరించుకుంటున్నాను."

అనూరాధ మాట్లాడలేదు.

"అయితే మీ నిర్ణయాన్ని కూడా ఉపసంహరించుకోవాలి" అన్నాడు విజయుడు.

"అలా ఎప్పటికీ జరగదు. నేను మాట ఇచ్చాను. అంతా విన్నారు. లోకులు అతన్ని ఎత్తిపొడుస్తారు."

"ఏమని ఎత్తిపొడవరు. అతనికి మీ యీడువున్న కొడుకులూ కూతుళ్ళూ వున్నారు. వారితో తగూలూ — పోట్లాటలూ వస్తాయి. అతని కుటుంబంలో కల్లోలం చెలరేగుతుంది. మీకు కూడా శాంతివుండదు. మీరు ఈ సంగతులన్నీ ఆలోచించారా?"

అనూరాధ వినయంగా, "ఆలోచించాను. అలాంటివేమీ జరగవని నా నమ్మకం" అన్నది.

విని విజయుడు స్తంభించిపోయాడు. "వృద్ధుడు ఎంతకాలం జీవిస్తాడని ఆశిస్తున్నారు?" అన్నాడు.

"లోకంలో ప్రతి ఆడదీ భర్తఆయుస్సు వృద్ధికావాలని కోరుకుంటూ వుంటుంది. ముత్తైదువునై నేనే ముందు చనిపోవచ్చుగా" అన్నది అనూరాధ.

విజయుడు ఎంత వెతికినా దీనికి సమాధానం దొరక్క స్తబ్ధుడై నిలబడిపోయాడు. కొంచెంసే పున్నతర్వాత వినయంగా "నన్ను వెళ్ళిపొమ్మని చెప్పినతర్వాత మళ్లా ఏనాడూ ఆ ప్రసంగం తీసుకురానిమాట యథార్థమే. నేను దయాపాత్రురాలను కాక

పోయినా దయతలిచారు. దానికి మనసులో ఎంత కృతజ్ఞత చూపెడుతున్నానో చెప్పలేను'' అన్నది

విజయుని వైపునుండి ఏమీ సమాధానం రాకపోయేప్పటికి "మిమ్మల్ని గురించి ఎవరిదగ్గరనైనా ఎక్కడైనా చెడుగా చెప్పానో లేదో భగవంతుడికే తెలియాలి. గంగూలీ మహాశయుడు ఏదైనా అనివుంటే అవి అతనివికాని, నావికావు. అయినా నేను అతని తరఫున క్షమాపణ కోరుకుంటున్నాను'' అన్నది మళ్ళా అనూరాధ.

"మీ వివాహ మెప్పుడు? జ్యేష్ఠ బహుళ త్రయోదశి కా? అయితే షుమారు ఒక నెలరోజులు వుంది కదూ?'' అన్నాడు విజయుడు.

"అవును."

"దీనిలో మార్పు ఏమీ లేదన్నమాట?"

"బహుశా వుండదు. అతను అలాంటి ఆశ పెట్టిపోయాడు."

విజయుడు చాలసేపటివరకు మెదలకుండా వూరుకొని, "అయితే నేను చెప్పేది ఇంకేం లేదు. కాని మీ భావిజీవితాన్ని గురించి మీరు కించిత్తయినా ఆలోచించనందుకు నాకు చాల విచారంగా వుంది."

"ఒక్కసారి కాదు, వెయ్యిసార్లు ఆలోచించి చూచాను. రాత్రింబగళ్ళు ఇదే నా ఆలోచన. మీరు నా మేలు కోరేవారు. మీకు కృతజ్ఞత తెలపటానికి నావద్ద తగినంత భాష లేదు. కాని మీరు స్వయంగా కూడా నన్ను గురించి సమగ్రంగా ఆలోచించి చూడండి — ధనం లేదు – రూపం లేదు, ఇల్లా లేదు – వాకిలి లేదు.

ఒంటరి జీవితంవల్ల వచ్చే అత్యాచారాలను, అనాచారాల నుండి తప్పించుకు తిరగటానికి ఎక్కడా శాస్త స్థానమైనా లేదు. ఇరవై మూడు, ఇరవై నాలుగు గేళ్ళ వయసు వచ్చింది అతను తప్ప నన్ను వివాహం చేసుకోటానికి ఇంకెవరు ఇచ్ఛగిస్తారో మీరే చెప్పండి? వట్టెడు మెతుకుల కోసం ఎవరిముందుకు వెళ్ళి దేవురించుతూ తిరగను? విని మీ రేమనుకుంటారు మనసులో!"
అన్నది అనూరాధ.

ఆ సంగతులన్నీ నిజమే. కాదనటానికి కూడా వీలు లేదు. రెండు మూడు నిమిషాలు మెదలకుండా నుంచుని విజయుడు మహానుతాపంతో "అలాంటి సమయంలో నేను మీ కేమీ ఉప కారం చేయలేనా? చేయగలిగితే బాల సంతోషిస్తాను" అన్నాడు.

"మీరు నాకు మరొకరెవరూ చేయలేనంత ఉపకారం చేశారు. మీ పంచను నేను నిర్భయంగా ఉన్నాను. బిడ్డలిద్దరూ— నాకు సూర్యచంద్రులు — నాకు అదే చాలు. అన్న చేసిన నేరా నికి నన్నుకూడా భాగస్వామినిగా ఎంచవద్దని నా ప్రార్థన. నేను బుద్ధిపూర్వకంగా చేసిన నేరమేమీ లేదు" అన్నది అనూరాధ.

"అది నాకు తెలుసు, మీరు చెప్పవలసిన అవసరం లేదు" అని విజయుడు మెల్లగా బైటికి వెళ్ళిపోయాడు.

౨౫

కలకత్తానుండి కూరలూ — నారలూ, పండ్లూ—ఫలాలూ వచ్చాయి. విజయుడు తట్ట వంటింటిముందు దింపించి, "లోపల వుంటారు చూడు..." అన్నాడు.

లోపలనుంచి మృదుస్వరంతో "ఉన్నాను" అని సమాధానం వచ్చింది.

"మిమ్మల్ని పిలవటంకూడా చాలా ఇబ్బందిగానే ఉంది. మా సమాజంలో అయితే మిస్ చటర్జీ అనో, మిస్ అనూరాధ అనో పిలిచేవాళ్ళము. కాని ఇక్కడ అలాంటి వేమీ సాగవు. పిల్లలైనా వుంటే — "మీ పిన్నిని పిలవరా" అని వెళ్ళమార్చుకోవచ్చును. కాని ఈ సమయంలో వారుకూడా అంతు లేరు. ఏమని పిలవమంటారో చెప్పండి?" అన్నాడు విజయుడు.

అనూరాధ వాకిటిదగ్గరకువచ్చి "మీరు యజమానులు! నన్ను 'రాధా' అని పిలవండి" అన్నది.

"పిలవటానికి ఏమీ ఇబ్బంది లేదు. కాని—యజమానిననే అధికారబలంతో కాదు. అధికారం వుంది గగనచటర్జీమీద — కాని అతను అంతు లేడు. యజమానులని మీ రనుకోటం దేనికి?" అన్నాడు విజయుడు.

"అలా అనకండి. మీరు యజమానులే" అని లోపల నుండి సమాధాం వచ్చింది.

"దానిని గురించి నేనేమి గట్టిగా చెప్పలేను. కాని వయసులో మాత్రం మీకంటే చాల పెద్దవాణ్ణి. పేరున పిలచినా మీరు కోపగించుకోకండి" అన్నాడు విజయుడు.

"లేదు."

విజయుడు ఎంత పులుముకు తిరుగుదామనుకున్నా ఆమె దూరదూరంగా ఉండటం గ్రహించాడు. ఆమె ఎదుటకు కూడా వచ్చేదికాదు. చాటునుండే సమాధానా లిచ్చేది.

"ఇంటిదగ్గరనుంచి కూరగాయలూ, పళ్ళూ వచ్చాయి. ఈ తట్ట లోపల పెట్టించి పిల్లలకు యివ్వండి" అన్నాడు విజయుడు.

"అక్కడ వుంచి వెళ్ళండి. అవసరమైనంతవరకు అట్టిపెట్టుకొని తక్కినవి మీవద్దకు పంపుతాను."

"వద్దు. అలా చెయ్యకండి. మా వంటవాడికి సరిగా చెయ్యటం చేతకాదు. పొద్దుటినుంచి దుప్పటి ముసుగు పెట్టుకొని పడివున్నాడు. మలేరియా పట్టుకుందో యేమో? ఇక నా యెముకలు తినేస్తాడు."

"మావాళ్ళల్లో మలేరియా లేదే. అతను లేకపోతే మీకు వంట ఎవరు చేస్తారు?"

"ఈ పూటకు ఫరవాలేదు. రేపు పొద్దున ఆలోచించుకోవచ్చును. వెంట కుక్కరు ఎల్లాగూ వుంది. ఏమీ లేకపోతే నౌకరుచేత దానిమీద వండించుకుంటా" అన్నాడు విజయుడు.

"కాని, చాల యాతనపడాల్సి వస్తుంది."

"యాతనేమీ లేదు. నాకు అలవాటైపోయింది. కాని పెద్దపడే యాతనలుచూస్తే కష్టంగానే ఉంటుంది. కాని ఇక్కడ ఆ భారం మీరు వహించారు. ఈపూట ఏమి వండుతున్నారు? తట్టతీసి చూడండి, ఏమైనా పనికివస్తాయేమో!"

"పనికివస్తాయి, కాని నేను ఈపూట వంటచెయ్యను."

"ఎందుకని!"

"కుమార్ వళ్ళు కొంచెం వెచ్చగా ఉంది. వంటచేస్తే అతను తింటానని మారాం చేస్తాడు. సంతోష్ పొద్దున మిగిలిన అన్నం తిన్నాడు."

"వళ్ళు వెచ్చగా వుందా యేమిటి? ఏది?"

"నా పక్కమీద పడుకుని సంతోషంతో కబుర్లు చెబుతున్నాడు. ఇవ్వాళ బెటికి వెళ్ళను, నీ దగ్గరే పండుకుంటాను. అంటున్నాడు."

"పండుకుంటే పండుకోనియ్యండి. కాని ఎక్కువ గారాన మాత్రం పెట్టకండి. మళ్ళీ పిల్లని వదలిపెట్టి కదలనంటాడు. తర్వాత చాల చిక్కుల పడవలసివస్తుంది" అన్నాడు విజయుడు.

"ఏమీ అవసరం లేదు. కుమార్ చెబితే వినని బిడ్డేమీ కాదు."

"ఏమి వింటాడో ఏమో! మిమ్మల్ని కూడా చాలా యాతన పెడుతున్నాడని విన్నాను" అన్నాడు విజయుడు.

అనూరాధ కొంచెం సేపు మెదలకుండా ఉండి, "వేధించితే నన్నొక్కదాన్నే వేధిస్తాడు. ఇంకెవరినీ వేధించడు" అన్నది.

"అది నాకూ తెలుసు. పినతల్లి సహిస్తే సహించవచ్చును. గాని సవతితల్లి సహిస్తుందా? ఏనాటికైనా సవతితల్లి వస్తే సాకటం కష్టం. అలవాటు పడితే వాడికీ నష్టమే." అన్నాడు విజయుడు.

"బిడ్డకు నష్టం కలిగించే సవతితల్లిని మీరు ఇంటికి తీసుకు రావటంమాత్రం ఎందుకు? మంచిది కాదు"

"తీసుకురా నవసరం లేదు. కాని కుర్రవాడి దురదృష్టం పండితే సవతితల్లి దానంతటదే వస్తుంది. ఆ నష్టాన్ని నిరోధించటానికి పినతల్లిని శరణుజొచ్చవలసి వస్తుంది" అన్నాడు విజయుడు.

"తల్లిలేని బిడ్డను పినతల్లి వదలిపెట్టలేదు. ఎన్ని కష్టనిష్ఠురాలకు లోనైనా వాణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేస్తుంది" అన్నది అనూరాధ. "సరే, చూస్తా—" అని విజయుడు వెళ్ళిపోతూ

మళ్ళీ తిరిగివచ్చి, "అతివినయమునకు క్షమించితే ఒక్క సంగతి..." అన్నాడు.

"అడగండి."

"వాడితండ్రి బ్రతికున్నాడు గనుక — కుమార్‌ను గురించి తర్వాత ఆలోచించవచ్చు. అతను మీరనుకున్నంత అనాథ కాదు. కాని సంతోష్? ఆమె తల్లిదండ్రు లిద్దరూ లేరు. పిన తండ్రి త్రిలోచనుని ఇంటిస్థానం లేకపోతే ఆమె ఏమైపోతుందో — దాన్ని గురించి ఏమైనా ఆలోచించారా?"

"అక్కకు స్థానముండీ చెల్లెలికి వుండదూ?" అన్నది అనూరాధ.

"ఉండవలసిందే, కాని నేను అతన్ని చూచినంతవరకు — అవన్నీ ఎక్కువ ఆశపెట్టుకున్నా లాభం లేదనిపిస్తూ వుంది."

ఈ మాటకు సమాధానం అనూరాధ వెంటనే యివ్వలేక పోయింది. ఆలోచించటానికి కొంతసేపు పట్టింది. "అయితే ఏ చెట్టుకిందైనా ఇద్దరికీ స్థానం దొరుకుతుంది; అక్కడెవరూ కాదన లేరు" అన్నది శాంతస్వరంలో కాని దృఢంగా.

"పిన్నికితగ్గ మాటే. దాన్నెమీ కాదనలేము; కాని అది అసంభవము. అయితే ఆమెను మా యింటికి పంపించండి, కుమార్‌కు స్నేహితుడుగా. కుమార్ మనిషైతే అతనూ అవుతాడు" అన్నాడు విజయుడు.

లోపలినుంచి మళ్ళీ ఏ సమాధానమూ రాలేదు. విజయుడు కొంచెంసేపు ఎదురుచూచి బైటకు వచ్చాడు.

రెండు మూడు గంటలైన తర్వాత సంతోష్ వచ్చి తలుపు

పైటనుంచుని "అక్కాయి మిమ్మల్ని భోజనానికి పిలుస్తావుంది" అన్నాడు.

"నన్నా ?" విజయుడు అడిగాడు.

"అవును" అని వెళ్ళిపోయింది.

అనూరాధ వంటింట్లో పీటవేసి ఉంచింది. విజయుడు పీటమీద కూర్చుని "రాత్రి చాల హాయిగావుంది. మీ రింత యాతన పడిందెందుకు ?" అన్నాడు.

అనూరాధ దగ్గరే నుంచుని వుంది. మాట్లాడ లేదు.

వడ్డించిన పదార్థాల్లో విశేషమేమీ లేదు. ఎంతో చక్కగా వడ్డించారు. భోజనంచేస్తూ "కుమార్ ఏం తిన్నాడు ?" అన్నాడు విజయుడు.

"సగ్గుజావ త్రాగి పండుకున్నాడు."

"ఇవ్వాళ తగువు లాడగలేదూ ?"

అనూరాధ నవ్వి "నా దగ్గర పండుకుంటాడు కాదూ, ఇవ్వాళ చాల శాంతంగా ఉన్నాడు. ఏమీ మారాం చెయ్య లేదు" అన్నది.

"వాడిమూలంగా మీకు యాతన ఎక్కువ అయింది. కాని దీనిలో నా తప్పేమీ లేదు. వాడంతట వాడే మెదలకుండా మీ ఇంట్లో ఎలా కలిసిపోయాడా అని ఆలోచిస్తున్నాను."

"నేనూ అదే ఆలోచిస్తున్నాను."

అనూరాధ మొదట మెదలకుండా వూరుకుంది. "మీరు ఇంటికి తీసుకెళ్ళేముందు ఒకమాట యిచ్చిపోవాలి. మా రతికి ఎటువంటి కష్టమూ రాకుండా చూస్తూవుండాలి" అన్నది మళ్లా.

"నేను ప్రస్తుతం వ్యవహారాల్లో మునిగి, అటూ యిటూ

తిరుగుతూ వుంటాను. మీ మాట నిలబెడతానని నమ్మకం కలగటం లేదు."

"అయితే అతన్ని నా దగ్గరే వదిలిపెట్టి వెళ్ళాలి."

"మీరు చాల పొరపడుతున్నారు. ఇది మరీ అసంభవం" అని విజయుడు నవ్వుతూ మళ్ళీ భోజనం చెయ్యసాగాడు. తింటూనే మధ్యలో "వదినావాళ్లూ వస్తారని చెప్పాను. బహుశా వారు ఇక రారేమో" అన్నాడు.

"ఎందుకని ?"

"వస్తామన్న ఉద్దేశం మాకు వుంటుంది. పట్టణవాసులు పల్లెపట్టున అడుగుపెట్టటానికి ఇష్టపడరు. ఒక విధంగా మంచిదే అయింది. నేనొక్కణ్ణే మిమ్మల్ని చాల యాతన పెడుతున్నాను. వారుకూడా వస్తే ఇంకా యాతనగా వుంటుంది."

ఈమాటకు అనూరాధ అడ్డంతగులుతూ "మీరు అలా అనకండి. ఇల్లు నాదికాదు; మీ రెందరైనా చోటంతా నేనే ఆక్రమించుకు కూర్చున్నాను. వారొస్తే యాతన పడతానా ? అంతకన్న అన్యాయ ముంటుందా? నన్ను గురించి అలా భావించి నిజంగా మీరు అన్యాయం చేస్తున్నారు. మీరు నా యందు చూపిన కనికరానికి నేను చేసే ప్రతిఫలము ఇదేనా ?" అన్నది.

ఇన్నిమాటలు ఈవిధంగా ఆమె ఎప్పుడూ మాట్లాడ లేదు. సమాధానం విని విజయుడు స్తంభించిపోయాడు. ఈ పల్లెటూరి పిల్ల అతను అనుకున్నంత అశిక్షితురాలు కాదు. కొంచెం సేపు నిశ్శబ్దంగా వుండి, తన తప్పిదాన్ని ఒప్పుకుంటూ "నిజంగా నేను ఇలా అనటం ఉచితంకాదు. ఇది వుచితమనుకునే వారికంటే మీరు పెద్దవారు. సరే! రెండు మూడు రోజులలో నేను ఇంటికి వె

తాను. ఇక్కడికి వచ్చిన మొదట్లో నేను మీతో చాలా మొరటుగా వ్యవహరించాను. కాని అది మిమ్మల్ని తెలుసుకోకుండా జరిగింది. నిజంగా లోకంలో తరుచు అలానే జరుగుతూ వుంటుంది. అయితే వెళ్ళేముందు నేను చాల సిగ్గుతో మిమ్మల్ని క్షమాపణ కోరుకుంటున్నాను" అన్నాడు.

అనూరాధ మృదుస్వరంతో "క్షమించను" అన్నది.

"క్షమించరా ! ఎందుకని ?"

"మీరు ఇంతవరకు చేసిన అత్యాచారాలకు క్షమాపణ లేదు" అని ఆమె నవ్వింది దీపపు వెలుగులో ఆమె నవ్వు మొహము విజయుని కంటపడింది. క్షణంసేపు ఏదో తెలియని ఆశ్చర్యంతో అతని హృదయమంతా కదిలిపోయి, స్తిమితపడి, క్షణంసేపు మెదలకుండా వుండి. "ఇదే మంచిది ! నన్ను క్షమించనవసరంలేదు. అపరాధిగా వుంటే నేనెప్పుడూ జ్ఞాపకముంటాను" అన్నాడు.

రెండు మూడు నిమిషాలవరకు ఇద్దరూ మౌనంగా వూరుకున్నారు.

అనూరాధే మౌనభంగం చేసి "మీరు మళ్ళా ఎప్పుడు వస్తారు ?" అన్నది.

"అప్పుడప్పుడు వస్తూనే వుంటాను. కాని మీరు కనపడరేమో ?"

రెండవవైపున దీనికి ప్రతివాదన రాకపోయేప్పటికి విషయం యదార్థమేనని తెలుసుకున్నాడు. భోజనమైన తర్వాత విజయుడు బైటికి వెళ్ళబోతూ వుండేప్పటికి "తట్టలో కూరగాయలు చాలా వున్నాయి. మీ సువారంలోకి పంపను. రేపు ప్రొద్దునకూడా

ఇక్కడికే రండి భోజనానికి" అన్నది అనూరాధ.

"తథాస్తు! ఇతరులకన్న నాకు ఆకలి కొంచెం ఎక్కువని తెలిసిపోయిందనుకుంటాను. లేకపోతే ఒక్క ప్రొద్దున్నే ఏమిటి— విందుకాలం ఇంకా పొడిగించమని — నేను ఇక్కడ వున్నంత కాలం మీ చేతిభోజనమే తినిగాని ఇంటికి వెళ్ళే ప్రస్తావన తీసుకొచ్చేవాణ్ణి కాదు."

"అది నా అదృష్టం" అని సమాధానం వచ్చింది.

ఆ తర్వాత మూడురోజులకు బదులు ఐదురోజులు గడిచిపోయినాయి. కుమార్‌కి బాగా ఆరోగ్యం చిక్కింది. ఈ కొద్దిరోజుల విందులో ఏమీ లోటున్నట్టు కనపడలేదు. విజయుడికి ఆమె పరిచయంకూడా అంతకన్న గాఢం కాలేదు. వసారాలో పీటలువేసి అనూరాధ అన్నం చల్లారబెడుతూ వుంటుంది. సంతోష్ వడ్డించుతూ వుంటాడు. కుమార్ వచ్చి 'చేపలకూర అంతా వదలిపెట్టకుండా తినాలంటోంది నాన్నా' అనేవాడు. 'నాన్నగారు నాకేమీ కాదని మీ పిన్నితో చెప్పు' అనేవాడు విజయుడు. కుమార్ మళ్ళీవచ్చి 'కూర వుంటే వుందిలే, నిన్నటి లాగ గిన్నెలోపాలు గిన్నెలోనే వుంటే ఆమెకు చాల దుఃఖం కలుగుతుంది' అనేవాడు. విజయుడు విని 'నిన్నలాగ చెంబుకు బదులు పాలు గిన్నెలోయిస్తే వుండవు అని చెప్పు' అనేవాడు.

౬

ప్రశాంతంగా ఈ అయిదురోజులూ గడచిపోయింది. స్త్రీల ఆదరసత్కారాలను గురించి విజయుని మనసులో ఎప్పుడూ స్పష్టంగా లేదు. చిన్నప్పటినుంచీ తల్లి అసమస్కారాలుగా తన

పడుతూ వుండేది. ఇల్లాలి కర్తవ్యం ఆమె ఎప్పుడూ పూర్తిచేయ లేక పోయేది అతని భార్యకూడా రెండు రెండున్నర సంవత్సరాలే జీవించివుంది. అప్పుడు అతను చదువుతున్నాడు – ఆ తర్వాత అతని జీవితం దీర్ఘప్రవాసంలోనే గడచిపోయింది. అతనికి అప్పు డప్పుడు తన జీవిత అనుభవాలు అనేకం జ్ఞప్తికి వస్తూవుంటాయి. కాని అవన్నీ పుస్తకాల్లో చదివే కల్పనా కథల్లాగ అస్వాభావి కంగా తోచేవి. జీవితంలోని వాస్తవికావసరాలతో అతని కేమీ సంబంధం లేదు.

ఇక వదిన ప్రభామయి ఉన్నది. ఆమె పెత్తనం చేస్తున్న కుటుంబంలో మంచి చెడ్డల విచక్షణ జరుగుతూ ఉండేది. ఆ కుటుంబం అతనికి తనదిగా తోచేదికాదు. అనేకసార్లు తల్లి ఏడుస్తూవుండటం చూశాడు. తండ్రి కోపంతోనూ, ఉదాసీనత తోనూ ఉండటం గ్రహించాడు. కాని ఈ విషయాలన్నీ అతనికి అసందర్భముగా, అనధికారచర్చగా తోచేవి. పెత్తండ్రి భార్య తన మరది మంచిచెడ్డలు కనుక్కోకుండా వున్నా, కోడలు అత్త మామలకు సేవచేయకపోయినా అతనికి మహాపరాధంగా తోచేది కాదు. తన భార్యకూడా అలా చేయటంచూస్తే అతనికి బాధ కలుగుతుందని లేదు. ఈ అయిదురోజుల్లో అతని ఈ ధోరణి అంతా శిథిలమైపోయింది. ఇవ్వాళ సాయంత్రం బండికి అతడు కలకత్తా వెళ్ళవలసివుంది. నౌకర్లు సామానంతా మూటకట్టి సిద్ధం చేస్తున్నారు. ఇక కొద్ది గంటలే వుంది. ఇంతలో సంతోష్ వచ్చి "అక్కాయ్ భోజనానికి పిలుస్తూవుంది" అన్నది.

"ఇప్పుడా ?"

"అవును" అని సంతోష్ అక్కడనుంచి వెళ్ళిపోయింది.

విజయుడు లోపలకు వెళ్ళి చూశాడు. వసారాలో పీటవేసి భోజనానికి సిద్ధంచేసివుంది. కుమార్ పిన్ని మెడపట్టుకుని వ్రేలాడు తున్నాడు. అతన్ని చేత్తో వదిలించుకొని వంటి ఇంట్లోకి వెళ్ళింది.

పీటమీద కూర్చుని విజయుడు "ఈవేళప్పుడు ఇదేమిటి?" అన్నాడు.

"కాస్త పులగం చేశాను. భోంచేసి వెళ్ళండి" అన్నది అనూరాధ.

సమాధానం ఇవ్వటానికి విజయుడు ఇవాళ కొంచెం గొంతు సవరించుకోవలసి వచ్చింది. "ఇంత శ్రమపడి ఇన్ని చేసింది ఎందుకు? నాలుగు పూరీలుచేస్తే చాలకపోయిందా?" అన్నాడు.

"పూరీలు మీరు తినరుగా. ఇంటికి చేరేప్పటికి రాత్రి రెండుగంట లౌతుంది. తినకుండా వెళ్ళినా నేను తర్వాత బాధ పడేదాన్నా? బిడ్డ తిండీ తిప్పలూ తినకుండా పసివు టాడు కామాను — అని జ్ఞాపక మొచ్చేది."

విజయుడు మెదలకుండా భోంచేస్తున్నాడు. "వినోదుకు చెప్పేశాను. అతను మీ మంచిచెడ్డలు చూస్తూ వుంటాడు. మీరు ఈ ఇంట్లో ఉన్నంతకాలం మీ కెలాంటి కష్టమూ వుండదు" అన్నాడు మళ్ళా.

మళ్ళా అతను కొంచెంసేపు మెదలకుండా వుండి "ఇంకొక మాట చెప్పిపోతున్నాను. ఎప్పుడైనా గగనుడు వస్తే — నేను అతన్ని క్షమించానని చెప్పండి. కాని అతను ఇక ఈ వూళ్ళోకి రావద్దనండి! వస్తే క్షమించను" అన్నది.

"ఎప్పుడైనా వస్తే చెబుతాను" అని అనూరాధ మెదల కుండా వూరుకుంది. మళ్ళా క్షణంసేపు వుండి "కుమార్‌ని కొట్ట కండి! ఇవ్వాళ అతనికి వెళ్ళటానికి ఏమీ ఇష్టంలేదు." అన్నది.

"వెళ్ళటానికి ఎందుకు ఇష్టంలేదో అది చెప్పడు" అన్నది.

"వాడికే తెలియుండి ఏమి చెబుతాడు? మనసులో అక్కడికి వెళితే కష్టంగా వుంటుందనికూడా అనుకుంటాడు" అన్నాడు విజయుడు.

"ఎందుకు కష్టంగా వుంటుంది?"

"ఆ యింటి ఆచారమది. కష్టాలున్నా వాడు ఇంత పెద్ద వాడయింది అక్కడేగా!"

"అయితే అతన్ని తీసుకెళ్ళకండి. ఇక్కడ నా వద్దే వుండనీయండి."

విజయుడు నవ్వుతూ "నా ఆటంక మేమీ లేదు. కాని ఒక నెలరోజులకంటె ఎక్కువ వుండలేడు. దానివల్ల లాభం?" అన్నాడు.

ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు. "ఇతని సవతితల్లి వస్తుందని విన్నాను. చదువుకున్నదట" అన్నది అనూరాధ.

"అవును, బి. ఏ. పూర్తిచేసింది"

"బి. ఏ. పీడి పెత్తల్లికూడా చదివిందిగా?"

"అవును. కాని ఆ బి. ఏ. పుస్తకాల్లో మరదిని ఆదరించమన్న విషయం వ్రాయలేదు. ఈ విషయంలో ఆమె పరీక్ష యివ్వానవసరం లేకపోయింది."

"రోగగ్రస్తులైన అత్తమామలో! ఆ విషయం కూడా పుస్తకాల్లో రాసిలేదా?"

"లేదు. ఈ ప్రస్తావన మరీ హాస్యాస్పదం."

"హాస్యాస్పదం కాని విషయమేమైనా వుందా?"

"వుంది. ఏ విధమైన ఫిర్యాదు చేయకుండా వుండటమే మన సంఘంలో సురక్షితమైన పద్ధతి."

అనూరాధ క్షణంసేపు మెదలకుండా ఉండి. "ఆ పద్ధతి మీలోనే ఉండనియ్యండి. బిడ్డ బి. ఏ. పరీక్షకు మించింది. అలాంటి ఆడదాన్ని చేసుకోటమే పొరపాటు." అన్నది.

"ఎవరినో ఒకర్ని చేసుకోక తప్పదుగా! మన మున్న సమాజవాతావరణాలలో బి. ఏ. ప్యాసయే గౌరవంకూడా దక్కదు. సంసారమూ నడవదు. తలిదండ్రులు లేని చెల్లెలిబిడ్డను చెట్టుకింద ఉండ నిష్టపడే ఇల్లాలితో మనం వనవాసం అయినా చేయగలము గాని కాపురం చేయ లేము."

అనూరాధ స్వరము క్షణంసేపు తీవ్రమైంది. "వద్దు. అలా చేయవద్దు. మీరు ఇతన్ని ఏ నిర్దయ విమాతకూ అప్ప జెప్పవద్దు" అన్నది.

"ఆ భయమేమీ లేదు. అప్పగించినా కుమార్ చేతి నుండి జారి కిందపడతాడు. అంటే దాని అర్థం. ఆమె నిర్దయురా లనికాదు. నా భావిషత్తి లెరక్షన నేను మీ మాటను తీవ్రంగా ఖండిస్తున్నాను. ఈ నేరం ఆమెమీద పెట్టకండి" అన్నాడు విజయుడు.

"అనూరాధ నవ్వి "మీ రెంతైనా ఖండించండి. హడలి పోయిన ఆత్మీయత అంటే ఏమిటో కొంచెం చెప్పండి" అన్నది.

"అది మా పెద్ద సర్కిల్ సంసారబంధం. దాని 'కోడ్'

నేను. మొహంకూడా ప్రత్యేకం. దాని వేళ్ళు నీకు పీల్చను. ఆ సిటిరంగు కూడా పచ్చదనం కాకుండా పసుపురంగు వస్తుంది. మీరు పల్లెటూరి గృహస్థుల ఇంటిబిడ్డలు. స్కూళ్లూ కాలేజీలలో చదివి ప్యాసవలేదు. టీపార్టీ – బాణాసంచాలలో పాల్గొనలేదు. వాటి సుగంధరహస్యాన్ని మీకు చెప్పలేను. కుమార్‌కి నచ్చే సవతితల్లి వాడికి విషమూ పెట్టదు, కొరడా చేతపట్టుకొని వెంటాడదు. అందుచేత ఈ విషయంలో మీరు నిశ్చింతగా ఉండండి" అన్నాడు విజయుడు.

"నేను ఆమె సంగతి వదలిపెడతాను. కాని మీరు స్వయంగా వస్తూవుంటానని మాట ఇవ్వండి. నేను ఇదే విన్నవించేది" అన్నది అనూరాధ.

"మాట ఇవ్వాలనిపించుతున్నది గాని నా స్వభావము, పద్ధతి, అలవాటు లోకంలో వేరుగా ఉంటవి. మీ మాటను మనసులో పెట్టుకుని అప్పుడప్పుడూ చూస్తూవుంటానికి ప్రయత్నిస్తాను. కాని మీరు చెప్పినంత జరగదని అనుకుంటున్నాను. సరే, భోజనమైంది. ఇక వెళతాను. ప్రయాణానికి సిద్ధంకావాలి" అన్నాడు విజయుడు.

అని అతను లేచి నుంచుని "కుమార్ మీవద్దే వుంటాడు! ఇల్లు వదలి వెళ్లేరోజున వినోదుని వెంట కలకత్తా పంపండి. అవసరమనుకుంటే వాడివెంట ఏమీ సంకోచపడకుండా సంతోష్‌ను కూడా పంపండి. మొదట్లో మీతో వ్యవహరించినటువంటిది కాదు నా స్వభావము. వెళుతూ మా ఇంటివద్ద — కుమార్‌ను మించిన అనాదరం సంతోష్‌కి జరగదని ఆశపెట్టి పోతున్నాను" అన్నాడు.

*

ఇంటిముందు గుర్రపుబండి నిలబడి వుంది. సామానదీ వేశారు. విజయుడు బండి యెక్కబోతూ వున్నాడు. ఇంతలో కుమార్ వచ్చి, "నిన్ను పిన్ని పిలుస్తావుంది నాన్నా ?" అని చెప్పాడు.

అనూరాధ తలవాకిటివద్ద నుంచుని ఉంది. "నమస్కారం చెయ్యటానికి పిలవమన్నాను. మళ్ళా ఎప్పుడు చేయగలుగుతానో ఏమో !" అని ఆమె వంగి నమస్కారం చేసింది మళ్లా నుంచుని కుమార్ని తన వళ్ళోకి తీసుకొని, "నన్ను గురించి విచారపడవద్దు. పిన్నిదగ్గర వున్నంతవరకు ఎలాంటి అనాదరమూ జరగదని నాన్న గారికి చెప్పు బాబూ !" అన్నది.

విజయుడు నవ్వి "నమ్మడం కష్టం" అన్నాడు.

"ఎందుకు కష్టం ? మీరొస్కాడానా ?" అని ఆమె నవ్వింది. ఇద్దరూ ఒకరిమొహాలు ఒకరు చూచుకొన్నారు. ఆమె కను రెప్పలు తడిగా వున్నాయని విజయుడు స్పష్టంగా గ్రహించాడు. మళ్ళా తలవంచుకొని "కుమార్ను తీసుకెళ్ళి బాధ పెట్టకండి. చెప్పటానికి ఇక అవకాశముండదని మాటిమాటికీ చెబుతున్నాను. మీ ఇంటిసంగతి జ్ఞప్తికి రాగానే అతన్ని పంపటానికి మన సొప్పటం లేదు."

"అయితే పంపకండి !"

ఆమె మెదలకుండా వూరుకుంది.

"వెళ్ళేముందు మళ్ళీ ఒకసారి జ్ఞాపకం చేసిపోనా — ఎప్పుడు ఏ అవసరం వచ్చినా నాకు ఉత్తరం రాస్తానని మాట యిచ్చారు" అన్నాడు విజయుడు.

"నాకు జ్ఞాపకముంది. గంగూలీ మహాశయుని నేను ముష్టి దానిలా యాచించవలసి వస్తుంది. కించపడుతూ అడగవలసి వస్తుంది. కాని మీ వద్ద అలాంటిదేమీ అవసరం లేదు. కావలసింది సంకోచం లేకుండానే తీసుకోనగలనని నాకు తెలుసు."

"సరే, జ్ఞాపక ముంచుకోండి" అని విజయుడు బైలుదేర బోతూవుండేప్పటికి అనూరాధ "అయితే మీరుకూడా ఒక మాట యిచ్చి వెళ్ళండి. అవసర మొచ్చినప్పుడు నాకుకూడా రాస్తూ వుంటానని" అన్నది.

"వ్రాయటానికి నాకేం అవసరం వస్తుంది అనూరాధా?"

"అది ఎలా చెప్పను. నావద్ద ఇంకేమీ లేవు — కాని అవసరమొస్తే హృదయపూర్వకంగా సేవ చేయగలను."

"మిమ్మల్ని వారు చెయ్యనిస్తారా?"

"నన్నెవ్వరూ ఆపలేరు."

## ౭

కుమార్ రాలేదని విజయుని తల్లి అనుమానంతో, "ఇదేమి మాటరా! పగవాళ్ళ ఇంట్లో బిడ్డను వదలిపెట్టి వచ్చావు?" అన్నది.

"పగవాళ్ళు పాతాళంలో కెళ్ళి దాక్కున్నారు అమ్మా! వాళ్ళను వెతుక్కు తీసురావటం ఎవరితరం? నీ మనుమడు వాళ్ళ పిన్నిదగ్గర వున్నాడు. కొన్నాళ్ళున్న తర్వాత వస్తాడు" అన్నాడు విజయుడు.

"అకస్మాత్తుగా వాడికి పిన్ని ఎక్కడనుంచి వచ్చిందిరా?"

"భగవత్ నిర్మితమైన ప్రపంచంలో అకస్మాత్తుగా ఎవరు ఎక్కడనుంచి వస్తారో ఎవరు చెప్పగలరు అమ్మా! నీ డబ్బూ-దస్కం తీసుకొని పరారయిన గగనచటర్జీ చెల్లెలు ఆమె. ఆమెను ఇంట్లోంచి గెంటించటానికే లాఠీలు పట్టుకొని యుద్ధానికి వెళ్ళాము. మధ్యలో మీ మనమడు అంతా గడబిడ చేశాడు" అన్నాడు విజయుడు.

తల్లి గ్రహించి "కుమార్ ఆమె వశమై పోయాడన్న మాట? ఆ పిల్లవాణ్ణి బాగా ఆదరించి ప్రేమించి వుంటుంది. చిన్నకొయ్యకు పాపం ఆదరణ ఎక్కడా దొరుకలేదు" అని ఆమె తన స్థితినిగురించి వూహించుకొని ఒక నిట్టూర్పు విడిచింది.

"నేను బైటవుంటూ వుండేవాణ్ణి. ఇంట్లో ఎవరెవరిని ప్రేమిస్తున్నారో, ఆదరిస్తున్నారో చూడలేదు. తీరా ఇంటికి చేరబోయేప్పటికి కుమార్ పినతల్లిని వదిలిరానన్నాడు" అన్నాడు విజయుడు.

తల్లి అనుమానం అప్పటికికూడా తొలగలేదు. "పల్లెటూరిపిల్లలు చాలా మాటలు చెబుతూవుంటారు. నువ్వు వెంట తీసుకురాకపోవటం బాగుండలేదు" అన్నది.

"నువ్వు పల్లెటూరి ఆడపడుచువై వుండికూడా పల్లెటూళ్ళను విమర్శిస్తున్నావా అమ్మా? చివరకు నీకు పట్టణపు పిల్లలమీద నమ్మకం కలిగిందా?" అన్నాడు విజయుడు.

"పట్టణపు పిల్లలా? వారి పాదాలకు వేయి నమస్కారాలు" అని తల్లి రెండుచేతులు ఎత్తి నెత్తిన కొట్టుకుంది.

విజయుడు నవ్వాడు. "నవ్వుతావెందుకురా? నా దుఃఖం

నాకు తెలుసుంది కాని వారికి తెలుసా ?" అంటూ వుండగానే ఆమె కళ్లల్లో నీళ్లు తిరిగాయి. "ఇప్పటి వాళ్ళు మన మున్నప్పటి వాళ్ళా నాయనా ? కాలం మారిపోయింది" అన్నది తల్లి.

"చాలా మారిపోయినాయి అమ్మా! మీరు బ్రతికున్నంతకాలం మీ పుణ్యఫలాన అవి అలాగే వుంటాయి. వాటికి ఏ లోటురాదు. ఇప్పుడే కొంచెం మాచివచ్చాను. నీకు అది మాపించటం కష్టమని మనసులో విచారంగా వుంది" అని అతను ఆఫీసుకు వెళ్ళిపోయాడు. ఆఫీసు పనుల తొందరవల్లే అతను ఇక్కడికి రావలసివచ్చింది.

* * *

సాయంత్రం ఆఫీసునుంచి వచ్చి విజయుడు అన్నగారింటికి వెళ్ళి చూచాడు : కురుక్షేత్ర సంగ్రామం జరుగుతూవుంది. వినోద వస్తువులన్నీ అటూ ఇటూ విరజిమ్మి ఉన్నాయి. అన్న పడక కుర్చీమీద కూర్చుని బిగ్గరగా "ఎప్పటికీ కాదు! వెళితే ఒక్కదానివే వెళ్ళు. అలాంటి సంబంధాన్ని గురించి..." అంటు న్నాడు.

అకస్మాత్తుగా విజయుణ్ణి చూడగానే ప్రభకు ఒక్కసారి దుఃఖం పొర్లుకొచ్చింది. "నువ్వు చెప్పవోయ్. వారు అనీతను సితాంశునికి యిచ్చి చెయ్యటానికి నిశ్చయించుకుంటే నా తప్పేముందో? ఇవ్వాళ సంబంధం ఖాయపడింది. వీరు — పెళ్లికి వెళ్ళనంటున్నారు. అంటే నన్నుకూడా వెళ్ళొద్దనేగా" అన్నది.

అన్న మండిపడ్డాడు. "ఏమంటున్నావు – నీకు తెలియదు? ఇంతకాలంనుండి మనతో అలా చేయవలసిన అవసర మేమి వచ్చింది?" అన్నాడు.

అసలు విషయ మేమిటో ఒక్కసారిగా తెలుసుకోలేక విజయుడు సబుడైపోయాడు. తర్వాత తెలుసుకోటానికి కూడా, ఎక్కువసేపు పట్టలేదు. "ఆగు, ఆగు! అసలు ఏమి జరిగిందో చెప్పు? అనీతను శితాంశుఘోష్‌పాల్‌కు యిచ్చి వివాహం చేయటం నిశ్చయ మైందనేగా? ఇవ్వాళే సంబంధం ఖాయ మైందా? I am thrown completely over board" అన్నాడు.

అన్న గద్దించుతూ "హుం! ఈడకు ఏమీ తెలియనే తెలియదని చెప్పవలసివుంది" అన్నాడు.

ప్రభ ఏడుస్తూ "నేనేం చెయ్యగలను విజయా! అన్నయ్యా ఉన్నాడు. అమ్మవుంది. పిల్లకూడా ఒప్పుకొచ్చింది. వారు తను మాట పొగొట్టుకుంటూంటే దానిలో నా తప్పేముంది?" అన్నది

"వారు మోసకారులూ – పాషండులూ – అబద్ధాల కోరులూ – ఇదే తప్పు. ఒకవైపున చాటుమాటుగా తంత్రాలు పన్నుతున్నారు. ఇక లోకులు నవ్వుతారు; గుసగుస లాడతారు. నేను క్లబ్బులో కెళ్ళి తలెత్తలేను" అన్నాడు అన్న.

ప్రభ అదేవిధంగా దుఃఖితస్వరంతో "అలా ఎక్కడా జరగటంలేదా ఏమిటి? నీవు సిగ్గుపడవలసిన అవసరమేముంది?" అన్నది.

"ఆమె మీ చెల్లెలు కాబట్టే నేను సిగ్గుపడవలసివస్తుంది. రెండవది నా అత్తవారింటి వారంతా మోసకారులు కనుకనూ; దానిలో ఒక పెద్దభాగం నీకుకూడా ఉందికనుకనూ !"

ఈసారి అన్న మొహంకేసి చూచి విజయుడు నవ్వాడు. కాని వెంటనే అతను వదిన పాదాలకు నమస్కరించి ప్రసన్న వదనంతో "అన్నగారు ఎంత గర్జించినా, నేను కోపగించుకోను; విచారా పడను. కాని నిజంగానే దీనిలో నీకు భాగ ముందంటే నేను నీకు చిరకృతజ్ఞుణ్ణిగా ఉంటాను" అన్నాడు.

మళ్లా అన్నవైపుకు చూచి "నువ్వు కోపగించుకోటం నిజంగా చాలా అన్యాయం అన్నయ్యా! వారు మాటతప్పినా ఈ విషయంలో అలాంటిదేమీ లేదు. వివాహం బొమ్మలాటేమీ కాదు. సితాంశు ఇంగ్లాండులో ఐ. సి. యస్. ప్యాసయి వచ్చాడు. మరి నేను? ఇక్కడా ప్యాసవలేకపోయాను. ఇంగ్లాండు వెళ్ళి అయిదారేళ్ళు ఉన్నా, ఒక్క డిగ్రీకూడా సంపాయించలేక పోయాను. ఇప్పుడు కలప అడితిలో కర్రలు అమ్ముకుంటూ కాలం గడుపుతున్నాను. గౌరవప్రదమైన పదవులూ లేవు, బిరుదులూ లేవు. దీనిలో అనీతేమీ అన్యాయం చెయ్యలేదు అన్నయ్యా!" అన్నాడు.

అన్న కోపంతో "చెయ్యకేం! చేసింది అన్యాయం. నువ్వేమంటున్నావు — నీకేమీ విచారంలేదా?" అన్నాడు.

"నువ్వు పెద్దవాడివి. పూజ్యుడవు. నీతో అబద్ధమాడను అన్నయ్యా. నీ పాదాలంటి చెబుతున్నాను — నాకేం విచారం

లేదని, నా పుణ్యఫలంవల్ల కాదుగాని, ఏ పుణ్యఫలంవల్ల బైట పడ్డానో తెలియదు. వదినా, నిన్ను నేను తీసుకెళతాను. అన్నయ్య భీష్మించుకొని ఇంట్లో కూర్చుంటే కూర్చోనివ్వు. నువ్వూ నేనూ వెళదాం పద! నీ చెల్లెలిపెళ్ళికి కడుపునిండా విందు లారగించి వద్దాం" అన్నాడు విజయుడు.

ప్రభ అతని మొహంకేసి చూచి "నువ్వు నన్ను నవ్వు లాట పట్టించుతున్నావా?" అన్నది.

"లేదు వదినా, నవ్వులాటకాదు ఇవ్వాళ నేను హృదయ పూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను. మీ వదినలాంటి అదృష్టం నావైపు మళ్ళీ తలెత్తి చూడదమని. కాని ఇక ఆలస్యం చెయ్యకు. నువ్వు చీర మార్చుకో! నేనుకూడ ఆఫీసు డ్రస్సు మార్చుకు వస్తాను" అని త్వరగా వెళ్ళబోతూ వుండేప్పటికి "నీకు ఆహ్వానం లేదు, నువ్వెల్లా వెళతావు?" అన్నాడు అన్న.

విజయుడు వెనక్కితిరిగి నుంచుని "అయితే మంచిదే! వారు సిగ్గుపడివుంటారు. పిలవకపోయినా నాకక్కడికి వెళ్ళటానికి సంకోచమేమీ లేదు. పసుగెత్తుకొని వెళ్ళి — నువ్వు నన్ను చేసిన మోసమేమీ లేదు అనీతా! నాకు నీమీదేమీ కోపం లేదు. నువ్వు సుఖంగా ఉండమని నా ప్రార్థన – అని అనాలని పిస్తూవుంది. నా మనవి విను అన్నయ్యా! కోపం ఉంచుకోక వదినను తీసుకెళ్ళు, కనీసం నా తరఫునైనా మీ రిద్దరూ అతన్ని ఆశీర్వదించి రండి!" అన్నాడు.

అన్నా వదినా ఇద్దరూ స్తబ్ధులై అతని మొహంకేసి చూస్తూ ఉండిపోయారు. వారి దృష్టులు విజయుని వదనంమీద పడ్డాయి. అతని మొహంమీద వ్యంగ్య చిహ్నాలేమీ లేవు. క్రోధాభిమాన ఛాయలు అతని గొంతులో ఈ షణ్మాత్రం కూడా లేవు. ఏదో మహావిపత్తునుండి బైటపడ్డట్లు ఉంది. ఎంతైనా ప్రభ అనీతకు అక్కగా – చెల్లెలికి ఆమె ఇంగితమైన ఈ ఉపదేశ మివ్వలేదు. అభిమానంతో ప్రభ హృదయము మండిపోయింది. ఆమె ఏదో చెప్పబోయిందిగాని గొంతు నిండుకొచ్చింది "నా సంగతులన్నీ చెప్పే సమయం ఇంకా రాలేదు. ఎప్పుడైనానన్నుందో లేనోకూడా తెలియదు. ఎప్పుడైనా వస్తేమట్టుకు నువ్వు అదృష్ట వంతురాలవు మరిదీ! నిన్ను ఆశీర్వదిస్తున్నాను" అని అంటావు. అన్నాడు విజయుడు.

—o—

# రాగదీపం

## ౧

దీపాన్ని చూచి పండు అని భ్రమపడి కీటకాలు సంతోషంతో రెక్కలు కొట్టుకొంటూ వచ్చి ప్రమిదలో వాలతాయి. దీపాకర్షణ ఎంత ప్రబలమోగాని, చనిపోయిన పురుగులను చూచి వాలబోయే పురుగులు నిజానిజాలు గ్రహించే వివేకం లేక ఉద్రేకంతో పడి భస్మమైపోతాయి!

అలాగే రూపదీపం చుట్టూ ప్రలోభానికి దాసులై కాముకులు, ప్రణయ విశారదులు, రసికులు మిడతలవలె సంచరిస్తారు. ప్రణయతత్త్వాన్వేషకులూ, ఆరోగ్యంఉన్న బుద్ధిమంతులూ రూపానికి ముగ్ధులయినా క్రమేణా అసలుసంగతి తెలిసిన తరువాత నాయిక సంకుచిత హృదయ అనీ, స్నిగ్ధ కాదనీ గ్రహించి భావుకులు కొందరు రాగరసంలోనుంచి కాస్త తెప్పరిల్లక పోరు. రక్తి భావుకుల హృదయాంతరాళంలో వాసనారూపంగా ఉండి అప్పుడప్పుడూ చెలరేగుతూ ఉంటుంది. ఆ రకంవాడు కిరణ్.

కిరణ్ కలకత్తాలో బి. ఏ. ప్యాసై ప్రపంచ ప్రవృత్తి బాగా ఎరగక ఉద్యోగాలకు గొప్పవాళ్ళకాళ్ళు ఎలా పట్టాలో తెలియక తికమక పడ్డాడు. ఆశ్రయించడం, నెత్తిన కానీ దమ్మిడీ విలువచెయ్యని సన్యాసిని ఇంద్రుడనీ చంద్రుడనీ పొగడటమంటే కిరణునికి రోత. ఏమిచేయాలో తోచక కొన్నాళ్ళు తిరిగాడు. వర్ధమానంలో తండ్రి సంపాయించి ఇచ్చిన పెంకుటిల్లు, యకరం తోటా అతనికి మిగిలిన ఆస్తి. తండ్రీ తల్లీ పోయాక అతనికి

ముసలమ్మ దక్షతగా ఉంది. ముసలావిడ కూసూరాయుడు గతించినా, కిరణుని నా మనుకొని అతనిమీద పంచప్రాణాలూ పెట్టుకొని, పువ్వుల్లో పెట్టి పెంచింది. కొంతకాలంనుంచీ ఉద్యోగ ప్రయత్నము మానుకొని కిరణుడు ఇంట్లో కూర్చుని విద్యాపతి విరహగీతాలూ, మీరా పదాలు పాడుకొంటున్నాడు. సాయంకాలం నేల కిటికీదగ్గర కూర్చుని తోటలో పొడుగ్గా పెరిగిన చెట్ల అందాలు. రంగులమబ్బుల చివరల జరీఅంచులవలెవున్న సూర్యకాంతి చూచేవాడు. వెన్నెల కిటికీలోనుంచి ప్రసరించి సజ్జను చల్ల పరుస్తూ ఉంటే తోటలో మల్లెతీగెల పువ్వులు కోస్తూ నిట్టూర్పులు విడిచేవాడు. సజ్జమీద కూడా పువ్వులు చల్లుకొని పరుండి చంద్రుణ్ణి చూస్తూ మధుర భావాలు పొందే వెన్నెల తీగలతో అల్లుకొంటూ వీణాధరిని జ్ఞాపకం చేసుకొనేవాడు. ఎంత చక్కని పేరు వీణాధరి! కాలేజీలో అందరి పిల్లల్లో వెలిగిపిన దీపంలాగ ఉండి, అందరిని ఆకర్షించింది! అతను కాలేజీ చదువులో స్నేహసారం కన్నెల అందాలపొంగులు. కావ్యాలు చదివినా, ఏం చేసినా అన్నీ అతను మరిచిపోయాడు. వీణాధరిని మాత్రం మరవలేకపోయాడు. మల్లెల పరిమళం వెన్నెల అందం బాగా ఉన్నాయేకాని వీణాధరి రూపమును స్మరించేసరికి కిరణుడు మానసికంగా ఆకాశవీధుల విహరిస్తున్నట్టు తృప్తిపడేవాడు. ఊహాస్వప్నాలలో సుఖస్వప్నాలతో కాలం వెళ్ళబుచ్చుతూ ఉన్న అతను ఉద్యోగయత్నము పూర్తిగా వదిలేశాడు.

ఇంట్లో ముసలావిడ మనమడి ధోరణి తెలిసీ తెలియక గదిలోకి వచ్చి "ఏం నాయనా కిరణా? అలా గువ్వలా కూర్చున్నావేమి కిటికీదగ్గర?" అన్నది.

"ఏంలేదు అవ్వా" అని త్రుళ్ళిపడి సమాధానం చెప్పాడు కిరణ్.

ముసలివాళ్ళతో పడుచువాళ్ళ ప్రేమవృత్తాంతాలు చెప్పడానికి ఆట్టే ఇష్టపడరు. ఈడూ జోడయిన మిత్రులతో కిరణ్ మనసార చెప్పుకోవాలని తపనపడతాడు.

"ఏమో నాయనా! ఎన్ని సంబంధాలు వచ్చినా నీకు నచ్చవు. నీకు ఇష్టమైన పిల్లనే చేసుకో."

"అలాగే అవ్వా."

"మీ నాన్నకూ అమ్మకూ నిన్ను చూసుకునే అదృష్టం లేకపోయింది. పాపిష్టి ఘటాన్ని నేను బతికి ఉన్నాను. నువ్వు ఒక ఇంటివాడివి అయితే హాయిగా చనిపోతాను!" అని అన్నది.

"అలాగే" అంతకన్న కిరణుడు సమాధానం ఇవ్వలేకపోయాడు.

౨

కొన్నాళ్ళనుంచీ అతను బెంగగా ఉంటూ అప్పుడప్పుడు ఇంటికి వస్తున్నాడు. మునుపటిలాగా ఖుషాలాసాగా మల్లెలు పక్క మీద చల్లుకోడం లేదు. విద్యాపతి గీతాలు పాడటం లేదు. వెలుతురు చూడడానికి ఇష్టం లేక గదిలో చీకట్లో కూర్చుని తారలను లెక్కపెడుతున్నాడని ముసలమ్మ అనుకొన్నది.

ఎన్నిసార్లు శరణాలయం చుట్టూ, కాళ్ళకు బలపము కట్టుకు తిరిగినా వీణాధరి సరైన సమాధానం ఏమీ ఇవ్వలేదు. ఎప్పటికప్పుడు ఖులాసాగా మాట్లాడటం, గౌరవించటం, సభ్యతా,

సూటా-మంతీ ఇది చక్కగా నేర్చింది. కాని హృదయభావమును గాంభీర్యంలో అణగతొక్కి కిరణుడితో మాట్లాడుతుంది. అందువల్ల శరణాలయంలో వాళ్ళు కిరణ్ వీణాధరులకు చనువన ఏమీ అంటకట్టలేక తటపటాయిస్తున్నారు. శరణాలయం సూపర్నెంటు వీణాధరిని చూచి అనుమానించినట్లు కిరణుడు గ్రహించాడు. లోకప్రవృత్తి బాగా తెలియనివాడు కనుక కిరణుడు అందరినీ మంచిగానే గ్రహిస్తాడు

ఒకరాత్రి శరణాలయం తోటలో వీణాధరి తారట్లాడుతూ కిరణ్ కోసం ఎదురుచూస్తున్నది. తనమీద చాలా ఆశలు పెట్టుకొన్నదనీ, ఇంకా ఏవేవో ఆమె అతనితో చెప్పివేద్దామని అనుకొన్నది. రాలిపోయిన ఆకులమీద ఆమె నడుస్తున్నప్పుడు గల గల శబ్దమవుతున్నది. దూరాన ద్వారము తెరచి కిరణుడు ఆమెను సమీపించాడు. లాంచనమాత్రంగా ఆమె అతనికి నమస్కారం చేసింది. మూగవెన్నెల్లో ఇద్దరూ బాటమీద నిలబడ్డారు. కీచురాళ్ళు మోతపెడుతున్నవి.

“నే నిలా నిర్భయంగా మీ ఆవరణలోకి రావచ్చునా?”

“కిరణ్! రావచ్చును. ఇకనుంచీ నువ్వు రావడం తగ్గించాలి. మా సూపర్నెంటుగారికి చాలా కసిగావుంది మీమీద” అన్నది ముభావంగా. అలా ఎప్పుడూ వీణాధరి అతనికి సమాధానం చెప్పలేదు. ఎన్నో ఆశలు సౌధాలుగా కట్టుకొన్న అతను నిర్ఘాతపోయాడు.

“ఇలా అంటావని అనుకోలేదు!” అన్నాడు. అతని ముఖంలో చింతారేఖలు ఆమెకు కనపడకపోలేదు. అతని నిరుత్సాహం చూచి జాలి నభినయించింది.

"ఏంచెయ్యను కిరణ్! సూపరెంటెంట్ మాట వినకపోతే నాకీ నౌఖరీ పోతుంది."

"పోతే పోనీ, వెళ్ళిపోదాము. నేను సుఖదుఃఖాల్లో భాగం పంచుకొంటాను" దీనంగా అన్నాడు కిరణ్.

"మన మైత్రి చిరస్థాయిగా ఉండాలనే నేనూ కోరేది" అన్నది.

వివాహప్రశంస తీసుకురాక తప్పదని, ఇప్పుడు తప్ప చెప్ప వలసిన సమయము రాదని అనుకొని, "వీణాధరీ! ఎంతకాలంనుంచి నీమీద ఆశపెట్టుకొని నీ ప్రేమ దీపంతో చీకటి పోగొట్టుకొంటూ బ్రతుకుతున్నాను! మనం ప్రేమికులమై సుఖపడవద్దూ?" అన్నాడు.

అతని ఉద్రిక్తహృదయము కళ్ళల్లో వెలుగై మెరిసింది. ఆమె చీరకొంగు మెలివేస్తూ తలవాల్చి సమాధానం చెప్పలేక పోయింది. కొంతసేపు ఇద్దరూ మాట్లాడలేదు. హృదయ స్పందనాలు సవ్వడి చేస్తున్నవి.

"ఏం చెప్తావు వీణాధరీ నా ప్రశ్నకు."

తోటలో ఎవరో వస్తున్న అలికిడి వినవచ్చింది. ఆమె గ్రమ్మున వెనక్కుతిరిగి వెళ్ళిపోయింది. అతను ఆమె వెళ్ళేదాకా అడుగులకేసి చూస్తూ నిలబడి శూన్యహృదయంతో గేటుదాటి వచ్చేశాడు.

## 3

కిరణ్ నాలుగురోజులు శరణాలయం వైపు నడిచి వెళ్ళేవాడు. వీణాధరీ సందర్శనము అతనికి అభ్యాసమైంది. ఆమె కనపడక పోవడంవల్ల కుంగిపోయి బేలగుండెతో ఆమెను ఎరిగిన

...లపాటి ముజుందారును కలుసుకొన్నాడు.

"ముజుందారూ! నేను శయ్యమీద పడుండడం మానేశాను. మళ్లీ పాటలు చెయ్యలేను."

"కిరణ్! హిమానీ పదవచంద్రికలతో నీ ముఖం కళకళలాడుతోంది. అయితే ఆమె కనపడడం లేదూ?"

"లేదు. ఆమెకు నామీద అనురాగం వున్నదంటావా?"

"కిరణ్! నాకు తెలుసు, నీమీద గాఢప్రేమ ఉంది."

"నేను ఆమె కష్టసుఖాల్లో భాగం పంచుకొంటాననీ, వివాహం చేసుకొంటాననీ చెపితే సమాధానం చెప్పలేదు."

"ఆమెది చాలా లోతైన హృదయం."

"ఏమోగానీ సూపరింట్ మీద అనురాగం ఉందేమో నని తలపోశాను."

"లేదు లేదు. నిన్ను గురించి ఆమె ఎంతో ఆప్యాయంగా నా దగ్గర అన్నది. నీవు రాసిన పాటలూ, పద్యాలూ చదువుతూ ఉంటుంది."

"చదువుకొన్నది గదా ధైర్యంగా ఈవలికి వచ్చి నన్ను చేపట్టదేమి?"

"సాహసం లేక."

"అలా అనుకోను."

"విధవ కావడంవల్ల సంఘనీతినన్నా తెగతెంపులు చెయ్యలేక శరణాలయంలో ఉంటున్నది."

"పోనీ, శరణాలయ ధర్మకర్తలు పూనుకుంటే వివాహం అయిపోతుంది."

"వాళ్ళు ఆమెను పెళ్ళిచేయాలని లేరు. ఇంకా మంచి సంబంధం వస్తుందని ఆశపడుతున్నారేమో !"

"ఏం చెయ్యమంటావు ముకుందా?"

"ఉత్తరం రాసి రహస్యంగా ప. ప్ర. పోస్టు చెయ్యరా."

౪

కిరణుడు రెండు ఉత్తరాలు వీణాధరికి రాశాడు. ఆమె సమాధానము రాయలేదు సరిగదా అందినట్లుకూడా చెప్పలేదు. అతని హృదయం పరితపిస్తున్నది ఆమె రాసిన ప్రణయలేఖనైనా కనీసం చూచుకొంటేగాని అతని హృదయము తృప్తిపడేలాగ లేదు. ఇంట్లో మతిపోయినట్టు తిరుగుతాడు. ఎప్పుడో ఆమె ఇచ్చిన ఫోటో తీసి అతను అదేపనిగా చూస్తూ కూర్చుండిపోయేవాడు. పుస్తకం చదవలేక కాగితాలు తిప్పుతూ పరధ్యానంగా ప్రేయసిని స్మరించేవాడు. అతని మనస్సు రెక్కలు కట్టుకొని ఎగిరిపోయి శరణాలయంలోవున్న వీణాధరిని దర్శించేది. తనమీద రక్తి తగ్గిపోయిందా? సూపరింటు ఆమె హృదయాన్ని వశం చేసుకొంటున్నాడా? ఆమె బ్రతుకు బుగ్గిపాలు చేయదలచినాడా? ఏమో యోచించాడు. కొంతసేపటికి స్థాణువులా కూర్చున్నాడు. ప్రణయాన్ని స్వర్ణపీఠముమీద ఉంచడంవల్ల వాస్తవికత గ్రహించలేకపోయాడు.

రెండురోజులు తిండీ తిప్పలూ లేక జ్వరమని మిష పెట్టి కిరణుడు పడుకొన్నవాడు లేవలేదు. ఆమెను తలుచుకొన్నప్పుడు కురిపించిన కన్నీటితో అతని తలగడ తడిసిపోయింది. ఉత్తరమైనా రాయదేమి? ఆమెకోసము నా జీవితము త్యాగం చేస్తుంటే

గ్రహించదేమి? నా హృదయంలో ఎంత ఉన్నతమైన స్థానం ఇచ్చాను! భగవంతుడా! ఎందుకు వ్యర్థ ప్రణయాలు? గాఢంగా ప్రేమించే శక్తి నాకిచ్చి నన్ను ఇలా బాధ పెడతావా? వలపు తలకెక్కి తల పగులక్క పోతున్నాను. ఒక్క ప్రణయలేఖ నోచుకోలేదా!

ముగలాయిక పోగు పడలేక, కిరణ్ ఎంగిలి పడుతున్నాడు. శరీరము ఇంట్లో, మనసంతా వీణాధరి సన్నిధిలో ఉంటున్నాయి.

ముజుందారు మిత్రుణ్ణి చూడాలని వచ్చాడు.

"కిరణా! ఏమయింది? ఇలా ఉన్నావేం?"

"మనసు సరిగా లేదు. జీవితంమీద విరక్తికలుగుతోంది" అంటూ నిట్టూర్చాడు కిరణ్.

ముజుందారు ఓదార్పు అతని బాధను రెచ్చగొట్టింది. దానిని చల్లార్చేవిధానం ఒక్క అనునయంవల్ల కాదు.

కంటతడి పెడుతూ, "ముజుందార్! ఇన్నాళ్ళు ఆమె మీది అనురాగబలంవల్ల కాలంగడుపుతూ వచ్చాను. నాకు అన్ని విశ్వాసాలూ అడుగంటిపోతున్నై" అని జాలిగా అన్నాడు.

"విధివిలాసం! వీణాధరి తత్వం అర్థంకాదు."

"చంపకు! విధి అనీ, మతమనీ పేరుపెట్టి జీవితాన్ని నాశనం చేసుకోలేను. విధి నన్ను తృప్తిపరచదు. అర్థం కానప్పుడు, ఒడుదుడుకుల్లో సమాధానం ఇలాగేనా చెప్పుకొని సంతృప్తి పడడం! అబ్బ! నా రక్తి నశించి విరక్తిగా మారిపోతున్నది!" అని ఉద్వేగంతో కిరణ్ పలికాడు.

౫

కొన్నాళ్ళు ఊరంతా అట్టుడికినట్లు ఉడికిపోయింది.

వీణాధరిని ఎవరో లేవతీసుకు పోయారని పుకారు రేగింది. కిరణుడు మతిపోయి వీధులన్నీ తిరిగాడు. ఇంటికి వెళ్ళడం మానివేశాడు. భోజనం చేయాలని బుద్ధిపుడితే జేబులో డబ్బు లేక కాసేపు ఆలోచించి మంచినీళ్ళు తాగి, రైలు స్టేషను ప్లాట్ ఫారంమీద వచ్చేపోయే జనాన్ని చూస్తూ తిరిగాడు. వాన కురిసింది.

చీకటి పడింది. అరుగుమీద కూర్చున్నాడు. జేబులో ఉన్న ఫోటో తీసి ముక్కలు ముక్కలుగా చింపి పారేశాడు. అతని గుండెలు తీవ్రంగా కొట్టుకొన్నాయి. కళ్ళు చింత నిప్పుల్లా ఎర్రబడ్డాయి. నల్లని ఆకాశం ఎంతో క్రూరంగా నవ్వం కనిపించింది. చెరువుగట్టున కూర్చున్నాడు. విద్యుద్దీపాలు స్థిరంగా లేక నీళ్ళలో కదిలిపోతున్నాయి. వస్తువులు నీడల్లా కదిలిపోయి నాయి. అరుగుమీదికి వచ్చి మనసు కష్టంమీద చిక్కబట్టి చిన్న కాగితంముక్క జేబులోనుంచి తీశాడు. విరిగిన పెన్సిలుముక్కతో మాసిన కాగితంమీద వీధిదీపం వెలుతురులో రాశాడు జాబు.

“మంజుభాషిణీ! శుభాశీస్సులు!

ఈ ఆదివారం మూడో ఆదివారం — నువ్వు వస్తానని చెప్పిన ఆదివారంతో కలిసి మూడో ఆదివారం.

నువ్వు చెప్పిన ఆదివారం మీదనుంచి మరి రెండు ఆది వారాలు తాపీగా నడిచిపోయాయి. ఆదివారాలు పోతున్నాయి,

వస్తున్నాయి. నీవుమాత్రం ఉత్తరము రాయలేవు. ఆవేళ ఆఖరు నమస్కారంతో తప్పుకున్నావు అంతే. తెల్లవార్లూ ఆశతో ఆత్రంగా నిరీక్షించి, కాలి, భస్మంకాక మోడునై తిరుగుతున్నాను.

నాలుగు సంవత్సరాల ప్రణయం, తపస్సూ, తపనా ఒక్క నెలలో సమాప్తమయినవి ఏమి?

ఇలా ఇతరుల జీవితాలు భగ్నం చెయ్యడం మీ బృందానికీ, మీ అధికారులకూ సరదా అనుకొంటాను.

ఇష్టం ఉన్నా్నాళ్ళూ వాళ్ళను లాలించి, అనంతపథాల్లో ఊగించి, వెర్రెత్తించి కొండశిఖరాన కూర్చోపెట్టి ఇక్కడే ఉండు ఇప్పుడే వస్తాను అని చెప్పి మాయము కావడమూ! దూరాన్నుంచి ఏమీ చెప్పక వెక్కిరిస్తూ వేధించడమూ!

ఏ ఇష్టదేవతకైనా నువ్వూ, మీ నూపరెంటూ కొంత మంది అమాయకుల జీవితాల్ని బలి యిస్తారా?

ఎందుకీ నిలకడలేని నడవడీ, ఇష్టంలేని నటనా, సంతోషం లేని జీవితం! నిందపాలు చేసి, జీవితంమీద నిరాశ రగిలించి, ఆ వ్యక్తి బాధకు పిచ్చెత్తిపోవడమూ లేదా జీవితాన్ని నీకు బలిదానం చేస్తే, నీవు సంతోషించి వెటకారంగా ఒక్క నవ్వు నవ్వి అమాయకుడు, ఏం చేస్తాం అని అనడమూనా?

ఇలా ఇతరుల బ్రతుకులు నలగద్రొక్కి మరి పనికిరాకుండా చేయడం ఎందుకు?.........

ఈ విశాలప్రపంచంలో ఒక్కొక్కరికి ఒక్కొక్క రకం వినోదం!

నీకూ మీ సూపరింటులాగ రంగులు ఫిరాయించడం, పైవాళ్ళ జీవితాలను ప్రయోజనం లేకుండా నాశనం చెయ్యడం సరదా అనుకొంటాను.

చదువు సంధ్యలుండి—అంతకు పదిరెట్లు అనుభవం ఉండి—ఇతరుల బాధను గ్రహించే హృదయవైశాల్యం ఉండికూడా ఎందుకు చెప్పు ఈ నటనా కౌశలం? ఎందుకు జీవితాన్ని ఎడారి చేస్తావు? 'హాఫీజ' అన్నట్టు, దేనితోనైనా ఆటలాడవచ్చును కాని హృదయంతో ఆడితే ఎంత భయంకరం?

ఏదయినా చిత్రాన్ని చూచి అది వేదాంతంకానీ, విషాదాంతంకానీ, కొన్నాళ్ళపాటు ఆ ఘట్టాలను మరవలేము.

ఇక నిజంగా నా జీవితంలో జరిగిన అనుభవాలను ఎలా మరిచిపోను? హృదయం కాలిపోతుంది—నీ ఏ సంగతి జ్ఞాపకం వచ్చినా! ఏ దృశ్యం స్మరణకు వచ్చినా! ఎంత మరుద్దామన్నా మరవలేను.

నన్ను ఊరడించే ఆ సానుభూతి అప్పుడు నీ కన్నుల్లోని కలతను తెలుసుకొని ఇప్పుడు కళ్ళవెంట ........ రాలుస్తూవున్నాను.

నా విషయంలో నీ కుండే శ్రద్ధా – నా సంతోషంకోసం నీవు పడిన శ్రమా, నా నిరుత్సాహాన్ని చీల్చివేయడానికి నీ పాటలూ మాటలూ ఇవన్నీ నిజమేనా? లేక స్వప్నమా? అనే అనుమానంతో అప్పుడప్పుడు బాధపడతాను.

జరిగిపోయిందంతా సుఖస్వప్నమనీ, దాని స్మరణ బాధాకరమనీ నా మనస్సుకు సమాధానం చెప్పుకొని మరుద్దామంటే, ఆ నీడలు మనసులోనుంచి వదలవే!

మరుద్దామన్నకొద్దీ — పైకివచ్చి నన్ను అల్లరిపెట్టి — నాలో వేదన రగుల్చుచున్నవి! ఆ చిన్నెలు—చేష్టలు — నీ సభ్యతా?

ఏంచెయ్యను, ఆ నూపరెంటువల్ల మనం ఇద్దరం దూరమైపోయాము ఊళ్లో ఉన్నా.

కాని ఒకనాడు నీవు చూపిన అనుతాపం, కురిపించిన కన్నీరూ నన్ను మళ్ళీ ఎక్కడికో తీసుకొని పోతున్నాయి!"

"కిరణ్!"

ఉత్తరం పంపించి, కిరణుడు వెంటనే గాడేయ మఠనివాసానికి వెళ్ళాడు. భక్తిసూత్రాల బూజు దులిపాడు! వీణాధరిస్తానే రాధిక వచ్చి అతని వృత్తిని తదాకారము చేసింది.



|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA102B115 |
| పుస్తకం పేరు | ప్రేమ రాధ |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 75 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI, 68 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | thasin |
| పేజీలు విడదీసినది | nandini |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | No |
| తప్పులు | no |
| పరిస్థితి | good |